# గృహలక్ష్మి

VOL. 21. No 6.
JUNE 1952.



కీ. శే. బెంగుళూరు నాగరత్నంగారు

AS 6

# GRIHA LAKSHMI

LADIES' HOME JOURNAL

# కేసరి రత్నత్రయము

## లోధ్ర

### గర్భాశయరోగనివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలల, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును. లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదము, కల్పవృక్షము, కామధేనువు, కొంగు బంగారము, రత్నఖచిత యాభరణము, సర్వాభీష్ట ప్రదాయినియని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

12 ఔ. రు. 4-0-0 — 6 ఔ. రు. 2-2-0

## అమృత

### రక్తశుద్ధిద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, సుఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సునుయిచ్చును. ఈ మేలైన యౌషధమువలన నెందరో యారోగ్యవంతులైనారు.

12 ఔ. రు. 4-0-0 — 6 ఔ. రు. 2-2-0

## అర్క

### సర్వజ్వరనివారిణి

ఆహార, విహార ఋతుభేద దోషములవలన అన్నాశయమునందు క్రిమికీటము చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము, మరి యితర విషమజ్వరములను, కడుపులో ప్లీహమును జ్వరగడ్డను కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔన్సు బుడ్డీ రూ. 1-2-0

తపాలా ఖర్చులు ప్రత్యేకము

**కేసరి కుటీరం లిమిటెడ్**

ఆయుర్వేద ఔషధశాల

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14.

తెనుగుజిల్లాలకు, నైజామునకు, ఏజంట్లు :

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి

సంపుటము ౨౧]  జూన్ 1952  [సంచిక ౬




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు-రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యోద్దేశము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.



ఉత్తమనటి శ్రీమతి అంజలీదేవి

# విషయసూచిక










జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# కీ॥ శే॥ విద్యాసుందరి నాగరత్నం



. . . బహుభాషావేత్త - పండితురాలుగా 'విద్యాసుందరి' అయింది. ఉత్తమసంగీత విద్వాంసురాలుగాను, గాయకురాలుగాను 'గానకళావిశారద' అయింది. తాను ఆర్జించిన వేలకొలది ఆస్తిపాస్తులను భగవదార్పణమునకు, మానవసేవకు వినియోగిస్తూ విరాగినిగా 'త్యాగసేవాసక్త' అనిపించుకొన్నది.

ఒకప్పుడు ఆమెను మించినగాయకురాలు లేదేమో ననిపించింది. ఆమెగాన కళా నైపుణ్యాన్ని పండితులు, కవులు తమ కావ్యాలలో అమోఘంగా ప్రశంశించారు. ఆమె గాన సభలకు వేలాది ప్రజలు మూగి ఆనంద పరవశులయ్యేవారు. ఆమెను రాజులు, ఆస్థానాలు ఉచితాసనాలిచ్చి ఉన్నతంగా సన్మానించినవి. ఆరోజులలో సాధారణంగా శ్రీమంతుల యిండ్లలో 'విద్యాసుందరి' పాట కచ్చేరి లేనిదే పెండ్లిళ్లు జరిగేవికావు. ఈ రీతిగా ఆమెకీర్తి ప్రతిష్టలతో బాటు సంపాదించిన ధనకనక వస్తువాహనములు లెక్క లేవు.

అయితే ఆమె ఆర్జించిన సంపద భోగభాగ్య విలాసములకు వినియోగించ నుద్దేశించలేదు; త్యాగభక్తి వైరాగ్యముల నుద్దేశించినది.

గర్వాన్ని కాలదన్నింది. తన సర్వస్వాన్ని భగవత్ కైంకర్యముకొరకు, మానవ సేవకొరకు త్యాగముచేసింది. తాను 'సన్యాసినిగా' మోక్షసాధనమయిన భగవదారాధన, రామనామ స్మరణకు తనజీవితాన్ని అంకితము చేసింది.

అనేక దేవాలయాలలో ఉత్సవాలను, ఆరాధనలను ఏర్పాటుచేసింది. పెక్కుమంది అనాథలకు వివాహ సందర్భాలలోను, విద్యాభ్యాస సందర్భములోను సహాయం చేసింది. శ్రీ త్యాగరాజ స్వామి జన్మస్థలమయిన తిరువాయూరులో ఆలయ నిర్మాణం కావించి నైవేద్యదీపారాధనలకు శాశ్వత ఏర్పాటులు గావించింది. ప్రతి ఏటా జరుగు ఉత్సవాల సందర్భమున యాత్రికులకు భోజన వసతిసౌకర్యాలకు సుస్థిరమయిన ఏర్పాటులు గావించింది.

ఆమెకు సంస్కృత భాషయందభిమానము మెండు. దానివలన ధనము విశేషముగా పోగుచేసి తిరువాయూరులో పాఠశాల నిర్మాణమునకు కృషిచేసింది. ప్రతిఏటా కర్ణాటక సంగీతములో ప్రావీణ్యము చూపు విద్యార్థినిని బహూకరించుటకు గాను రు 2000/-లు కేసరి విద్యాలయమునకిచ్చి దాని మీద వచ్చు వడ్డీని అందుకు వినియోగించునట్లు ఏర్పాటుచేసింది.

ఆమె స్థూలశరీరం, మనోజ్ఞమైన కంఠస్వరం, ఉద్రూతలూపే వాక్చాతుర్యం ఆమెలోని ప్రత్యేకత. ఆమె ఉత్సాహాతిశయం, కార్యదీక్ష కొనియాడతగినది. ఆమె ఆత్మబలం చిన్నపెద్ద, మగ ఆడ, అనే విచక్షణకు అతీతమయింది. ఎవరితోనైనా పరిచయము సంపాదించి తనలక్ష్యాన్ని సాధిస్తూవచ్చింది.

తన ఉచ్చస్థితికి తల్లి దీక్షాత్యాగాలన్న విషయం గుర్తించి మాతృవాక్య పరిపాలనార్థం విద్యాబుద్ధులు నేర్చి, మేటిఅయింది. మోక్షసాధనాలయిన భక్తిత్యాగాలను స్వీకరించి భగవన్నామ స్మరణ చేయుచు సుఖిసూత్రంగా మే నెల 19వ తేదిన భగవంతునితో ఐక్యమయి ధన్యురాలైంది.

ఆమె నిర్యాణము కళారాధకులకు, నారీలోకానికి తీరనిలోటు కలిగించింది. ఆమె భక్తి వైరాగ్యాలు, మానవసేవాసక్తి, కార్యదీక్ష ఆదర్శపాత్రములు.

——(o)——

# వివిధ విషయములు

ది 19-4-52 న కొవ్వూరు మహిళా సమాజ 16-వ వార్షికోత్సవము త్రివిక్రమ భవనమునందు శ్రీ యల్లాపంతుల జగన్నాథం పంతులుగారి అధ్యక్షతన వైభవముగా జరిగింది. శ్రీ ఉప్పల నరసింహమూర్తిగారు, వారి సోదరి అనసూయ గారలు యీ సమాజపు అభివృద్ధికిగాను మహిళాలోకం సహాయపడవలెనని కోరుచు ఉపన్యసించిరి.

అధ్యక్షులు తమ ఉపన్యాసములో యీ సమాజపు అభివృద్ధిని కోరిరి. చిన్నచిన్న ప్రహసనములు, 'మిల్లు యజమాని' బుర్రకథ, 'సక్కుబాయి' నాటక ప్రదర్శనము జరిగెను. నాటకమునందు సక్కుబాయి పాత్రధారిణికి రజతపాత్ర, అత్తగారి పాత్రధారిణికి ప్రత్యేక బహుమతులు పంచిపెట్టబడెను.

  

కేసరి విద్యాసంఘ సమావేశము శ్రీ మైదవోలు శేషాచలపతిగారి అధ్యక్షతన ది 30-5-52 న శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారి మరణమునకు సంతాపమును తెలుపుచు యిట్లు తీర్మానించినది:

ఈ కేసరి విద్యాసంఘ సమావేశము శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారి మరణమునకు సంతాపమును తెలుపుచున్నది.

శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారు ఉత్తమ గాయకురాలు. ఆమె హయాము నాటి గాయకులలో ఉత్తమురాలుగా రాణించింది.

ఆమె దానధర్మము లనేకములున్నను, శ్రీమతి నాగరత్నంగారు కేసరి విద్యాలయమునకు రు 2000/-లు యిచ్చి దానిని కర్ణాటక సంగీతమునందు ప్రావీణ్యముచూపు విద్యార్థినికి బహుమతినిచ్చునట్లు ఏర్పాటు చేసినందుకు ప్రత్యేకముగా విద్యాలయము తమ కృతజ్ఞతను తెలుపుచున్నది.

  

మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి గౌ. పాకాల రాజమన్నారుగారి భార్య రాజామణిఅమ్మగారు మరణించిన సందర్భమున మాసంతాపమును తెలుపుచున్నాము. ఈమె మాగృహలక్ష్మికి చాల కాలముగా చందాదారులుగాను, వ్యాసములు వ్రాయుచును, చాల అభిమానించుచుండిరి. ఈమె మా పత్రికయెడల చూపుచుండిన ఆదరాభిమానములను మేము మరువలేము.

విచార సాగరంలో మునిగియున్న ఆమె భర్తకు, కుటుంబానికి మా సానుభూతి తెలుపుచున్నాము.

—(o)—

# బ్రతుకు తెల్లవారింది

శ్రీమతి బి. నీలవతి

అది పెద్ద బంగళా కాదు, అంత చిన్న ఇల్లు కూడా కాదు. ఒక కచ్చితమైన మిద్దెయిల్లు. దంపతులు మాత్రమే వుండటానికి సరిపోతుంది. ప్లీడరు గారి భార్య సరస్వతమ్మ మిద్దెపై వరండాలో కూర్చుని భర్తరాకకై ఎదురు చూస్తున్నది. రాత్రి 9.30 గంటలైనా అతను ఏమో ఆ రోజు ఇంటికి రాలేదు. గంటకో బస్సు వచ్చేది పోయేదితప్ప ఆ విశాలమైన వీధి నిశ్శబ్దముగానున్నది.

సరస్వతమ్మగారింటి పెరడు చాలా పెద్దది. అందులో ఇంటి యజమాని టెంకాయచెట్లు కూడా నాటించాడు. ఆ పెద్ద తోటకు పోలిగాడు కావలి. వాడి గుడిసెకూడా ఆ తోటలోనే వుంది. వాడికి భార్య మూడేండ్లబిడ్డతప్ప మరి యెవ్వరూలేరు. పగలంతా కట్టెలు కొట్టేవాడు పోలిగాడు. వానిభార్య 4 ఇండ్లలో పైపనిచేసేది. ఈ మధ్య వారిలో ఏవో తగవులాటలు జరుగుతుండేవి.

వీధివైపు చూస్తున్న సరస్వతమ్మకు అకస్మాత్తుగా ఓ పెద్దకేక వినిపించింది. ఆ వెనుకనే ఏడుపు శబ్దం, దబదబా బాదటం వినిపించాయి. "అయ్యో అమ్మా నన్ను చంపేస్తున్నాడు. అయ్యయ్యో..." పోలిగాని భార్యగొంతు సన్నగిలింది. "నాబిడ్డ కోసమైనా నన్నిలా బ్రతకనివ్వు. నా పీక నులిమెయ్యకు. నీకు పుణ్యముంటుంది" అని దీనంగా ప్రార్థించింది వెంకి. "ఓసేయ్ ... నిన్ను నరికి నాలుగు ముక్కలుచేసినా పాపంలేదు. వాడెక్కడున్నాడో చెప్పు ఇప్పుడే వాడిపనికూడా పట్టేస్తాను. నాకూడుతిని నన్ను మోసం చేస్తావుటే. నాదగ్గరా దొంగ ఏడుపు. నడుము ఇరగ్గొట్టేస్తాను." అని ఇంకా ఏదో వెర్రిగా కేకలేస్తున్నాడు పోలిగాడు. "అయ్యో నేనేపాపం ఎరగను, నమ్మ, ఆ దేముడికే ఎరుక, ఒట్టు, నాబిడ్డ సాక్షిగా చెపుతున్నా. నాకెవడినీ తెలీదు" అని ఏడుస్తుంది వెంకి.

ఇంతలో త్రాగుడు మత్తులో క్రిందపడ్డాడు పోలిగాడు. పొరిగింటివారి సాయముతో వాడిని గుడిసెలోకి తీసుకెళ్లి పడుకోబెట్టింది వెంకి. ఈ గందరగోళమంతా అయ్యేటప్పటికి ప్లీడరు వచ్చారు. సరస్వతమ్మ లేచి భర్తకు భోజనముపెట్టి తనుకూడా భోంచేసి కొంచెము సేపటికి ఇద్దరూ పడుకున్నారు.

"అమ్మగారూ తలుపు తీయ్యండి, తెల్లవారింది, పాత్రలు తోమాలి, పాలాయన వచ్చాడు," అని చెప్పి తలుపు తట్టింది వెంకి. సరస్వతమ్మ లేచివచ్చి తలుపు తీసింది. 'ఏమిటే వెంకీ రాత్రి మీయింట్లో ఒక్కటేగోల. ఇట్లా గోలచేసారంటే మేము ఎలా నిద్రపొయ్యేది? అయ్యగారితో (ఇంటి యజమాని) చెప్పమంటూరా? లేక బుద్ధితెచ్చుకుని గోలచెయ్యకుండా వుంటూరా!" అని మందలించింది సరస్వతమ్మ. "ఏమి చెప్పేదమ్మగారూ! వాడి త్రాగుమోతు తనానికి తగ్గట్టుగా ఎవరో నాపైన లేనిపోని చాడీలు చెప్పుతున్నారు. అదంతా విని వచ్చి నన్ను చావమోదుతాడు. ఈ బాధపడలేక పోతున్నానమ్మగారూ. ఏదైనా బావిలోనో చెరువులోనో పడిచస్తామనిపిస్తున్నది. ఒక్కొకప్పుడు" అని భోరున ఏడ్చింది.

"నాకథంతా మధ్యాహ్నమువచ్చి చెపుతాలెండి. దీని కంతకి కారణము ఎవరోకూడా చెప్పతాను." అంది వెంకి ఇంతలో భర్త పిలువగా సరస్వతమ్మ మిద్దెపైకి వెళ్లింది. వెంకి తన పని చూడడానికి వెళ్లింది.

మధ్యాహ్నము భోజనాలైంది. సరస్వతమ్మ తమలపాకు వేసుకుని తోట తలుపుతీసి గుమ్మాని కెదురుగా కుర్చీవేసుకు కూర్చుని ఆలోచిస్తుంది.

వెంకి నల్లగావున్నా దాని ముఖము చాలా కళగా వుంటుంది. 25 సంవత్సరముల యౌవనవతి, ఆరోగ్యవంతురాలు. బీదరాలైనా ఉన్న రెండు చీరలను వుతికి రోజూ స్నానముచేసి కట్టుకుంటుంది. ఎల్లప్పుడూ నవ్వుతూ నిగనిగలాడుతూ ఆకర్షణీయంగా వుండేది. పోలిగాడు పనిచేసే కట్టెలదొడ్డి యజమాని వెంకిని ఎప్పుడూ చురచుర చూస్తుండేవాడు. వెంకి నిరుపేదయైనా మానవతి, గుణవంతురాలు. పోలిగాడిది వట్టి మట్టిబుర్ర. ఎవరేది చెప్పినా నమ్మిపోతాడు.

వెంకి వచ్చింది. "అమ్మగారూ నాసిగ్గుమాలిన బ్రతుకు సంగతి మీతో చెప్పకోక ఇంకెవరికి చెప్పగలను" అని కూర్చుని చెప్పసాగింది.

నేను మామగాడు ఆ కట్టెల దొడ్డిలో పనిచేసే వాళ్లము. నేను పనిమానేసి రెండునెలలైనది. అప్పటినుండి మాఆయనకు నామీద అనుమానం బయలుదేరింది.

"అయితే నీవు ఎందుకు పనిమానేశావు" అని అడిగింది సరస్వతమ్మ.

"కారణము లేకపోలేదు, చెప్తావినండి. నేను ఆ కట్టెలదొడ్డిలో కూలికి కట్టెలు మోసేదాన్ని. నేను ఆ కట్టెల దొడ్డిలో అడుగుపెట్టగానే మా యజమాని నన్ను గుడ్లు పీకుక్కుని వచ్చేలాగా చూసేవాడు. ఆ చూడటములో బేరానికి వచ్చేవాళ్లకు చిల్లర ఇవ్వడముకూడా మరిచేవాడు. నేను అప్రయత్నంగా ఆయనవేపు చూసేటప్పుడు కన్నుకొట్టేవాడు. నేను ఇదంతా గమనించనట్లుగా వుండేదాన్ని. కాని కొన్నాళ్లకు తరువాత కారణములేకుండా నాతో బాతాఖాని మొదలెట్టాడు. నేనెట్లాగో తప్పించుకొని తిరిగేదాన్ని.

ఒకరోజున సాయంత్రము ఒక పెద్దాయనవచ్చి ప్రక్కవీధికి 5 గుండ్లు కట్టెలు మోసుకు రమ్మని చెప్పారు. అప్పటికే మసక చీకటి క్రమ్మింది. ఆ ముసలాయన అలా నిల్చుంటే నేను కొంచెము కొంచెముగా కట్టెలు తీసుకువెళ్లి వారి ఇంటిలో వేశాను. కట్టెలు అయ్యేటప్పటికి బాగా చీకటి పడింది. ఆ ముసలాయన నాచేతిలో కూలి డబ్బులు పడేసి వెళ్లిపోయాడు. ఇంటికి పోదామని నేను రెండు అడుగులు వేసేటప్పటికి యజమానుడు నన్ను పిలిచాడు. "వెంకీ! ఇలారా - నాకు ఒక బీడీల కట్ట తెచ్చిపెట్టు. ఇదిగో చిల్లర." అని నా చేతులలోకి పడేశాడు. నాకు జల్లుమనిపించింది. అయినా విధిలేక వెళ్లి బీడీలు పట్టుకొచ్చి వాని ఎదుట బల్లపైనపడేసి గిరుక్కున తిరిగాను. అంతలో నాచీర చెంగు లాగినట్లనిపించింది. తిరిగి చూశాను. ఇంకేముంది నేననుకున్నపని జరిగింది. ఒక్క నిముషము నాఒళ్లు గడగడ వణికిపోయింది. అయినా ధైర్యము తెచ్చుకున్నాను. ఇంతలో వాడు నా చేతులు పట్టుకొని "వెంకీ మరేమి భయపడకు. ఇక్కడ ఎవ్వరు చూడరులే. ఇలా దగ్గరికిరా. ఇవ్వాళ నువ్వు చాలా అందంగా కనుపిస్తున్నావుసుమీ. ఈ రెండు నెలలుగా నీకోసము ఎంతగా తపించిపోతున్నానో తెలుసా. ఇన్నాళ్లకి నీవు నాకీ రోజున దక్కినావు. ఇదుగో ఈ 5 రూ॥లు తీసుకో, నాకోరికతీర్చు" అని నన్ను కౌగిట్లోకి లాక్కోబోయాడు. అంతవరకూ భయంతో బొమ్మలాగ నిలబడిపోయిన నాకు వానిమాటలువిని అరికాలిమంట నెత్తికెక్కింది. అంతే నాచేతులు విడిపించుకొని ఒక్క త్రోపు త్రోశాను. దాంతో కుర్చీపైనుంచి క్రింద బడ్డాడు. వాడికళ్లు ఎర్రగా చింత నిప్పుల్లాగ తయారయ్యాయి. కోపంతో మాట్లాడలేకపోయాడు. అంతతో నేను వూరికే వుండక "ఛీ దుష్టముండాకొడుకా! నీకేమి పొయ్యేకాలమురా! నామగాడు చూశాడంటే నీఎముక విరగ్గొడతాడు. వాడికి ఈ సంగతి తెలిస్తే నీవు చచ్చావన్నమాటే. జాగ్రత్త, ఇంక నాజోలికిరాకు, నా మానాన్ని అమ్ముకునేకంటే నాలుగిళ్లు ముష్టిఎత్తుకుంటాను. నీ వెధవ డబ్బులు ఎవరిక్కావలి. ఇంకో సారి నాజోలి కొచ్చావంటే చీపురుకట్టతో సింగారిస్తాను" అన్నాను. అప్పుడు వాడికంటికి కాళమ్మలాగు కనుపించాను కామోసు. ఒక్క క్షణం

గజగజలాడిపోయాడు. అయినా సమాళించుకొని "హో మహా పతివ్రతలే వున్నావే! బలవంతానైనా నా కోరిక తీర్చుకోగలను, కానియ్యి, ఇంక చూచుకో నా దెబ్బ. నీ మగడి చేతనే నిన్ను తన్నిస్తాను" అన్నాడు. వాని మాటలు వినిపించుకోకుండా ఇంటివైపు నడిచాను.

మామగాడిది వట్టి మట్టి బుర్ర. ఎవరేది చెప్పినా నిజమని నమ్ముతాడు. ఆ కట్టెల దొడ్డివాడు నాపైన లేనిపోనిది చెప్పితే విని నిజమనుకొని నన్నిలా చావ చంపుతాడు. నేనేంచెయ్య నమ్మగారూ. ఈ తిట్లు దెబ్బలు భరించలేకుండా వున్నాను." అని ఏడవ సాగింది వెంకి.

"అయితే వెంకీ! ఇదంతా నిజమేనా?" అనింది సరస్వతమ్మ.

"అమ్మగారూ ఇదంతా నిజము-నాబిడ్డతోడు" అని జాలిగా సరస్వతమ్మవైపు చూచింది. సరస్వతమ్మకు జాలివేసింది. కొంచెము సేపు ఆలోచించి "అయితే ఇలా నాదగ్గరికి రా" అని వెంకి చెవిలో ఏదో రహస్యము చెప్పింది, "అలా చెయ్యి, తప్పకుండా నీమగడు దారికి వస్తాడు" అనింది.

వెంకి ముఖము కొంత వికసించినది. "అలాగే చేస్తా నమ్మగారూ నేను పోయివస్తా."

ఓ వారము రోజులు పోలిగాడికి ఎక్కడా కల్లు దొరకలేదు. వెంకికి దెబ్బలుకూడా చాలా మట్టుకు తగ్గింది. ఆ రోజు శుక్రవారము తెల్లవారినుండి సాయంత్రము వరకు అష్ట కష్టాలుపడి రెండు బుడ్డీల సారాయి తీసుకొని చీకటి వేళకు ఇంటికొచ్చాడు. దారిలో కట్టెలదొడ్డి యజమానుడు ఎదురై "ఒరే పోలిగా నీ పెళ్ళాం వాడితో నీవు త్రాగుతావని పోలీసుకు రిపోర్టు చెయ్యమని చెప్పిందిరా. నీవు జైలు కెళ్ళావంటే, ఇక్కడ వాళ్ళిద్దరు ఆనందంగా హాయిగా భయంలేకుండా వుండవచ్చనికూడా చెప్పిందిరా. వాడుకూడా సరేనని తలవూపాడు. ఇంక జాగ్రత్తగావుండు," అని చెప్పి తన దారిని పోయాడు. ఇదుగో ఇప్పుడే దాన్ని రెండు ముక్కలక్రింద నరికి పారేస్తాను. అని గొణుక్కుంటూ ఇల్లుచేరుకున్నాడు. వెంకి ఇంటిలో లేదు వాడి కోపము రెట్టింపుగా మారింది. త్రాగడం మొదలు పెట్టాడు. ఆ మత్తులో వెంకిని ఎదురుచూస్తూ కన్నట్లు తిట్టసాగినాడు.

వెంకి మరో ఇంట్లోకూడా పనిచేసేది. వారు నూతన దంపతులు. పైగా క్రొత్త కాపురం. విమలకు రాత్రిపూట ఒంటరిగా వుండాలంటే చాలా భయము. ఆ రోజు తన భర్త ఇంటికి రావడానికి చాలా ఆలస్యమైనది. ఒంటరిగా వుండలేక వెంకిని తన భర్త వచ్చేంతవరకూ వుండమని చెప్పింది. అందుచేత వెంకి ఆమెతో వుండవలసి వచ్చింది.

విమల భర్త ఇంటికి వచ్చేటప్పటికి 9-30 గంటలయింది. చాలా రాత్రిఅయి ఇంటికి వెళ్లితే భర్త తన్నేమి చేస్తాడోనని వెంకి భయపడుతూ ఇంటికి వెళ్ళింది. ఇంట్లో భర్త రాక్షసుడులాగ ఏనిమిషాన వెంకిని చంపుతాడో అన్నట్లు వెంకిని తిట్టుతూ భయంకరంగా కేకలు వేస్తున్నాడు. త్రాగుడు మత్తులో వాడికి ఒళ్ళు తెలియలేదు. వెంకి గజగజ వణకిపోతూ ఇంట్లో అడుగు పెట్టింది.

దాన్ని చూస్తూనే పోలిగాడికి ఎక్కడలేని కోపము వచ్చేసింది. కళ్ళు చింతనిప్పుల్లాగ వున్నాయి. వెంటనే లేచి వెంకి జుత్తు పట్టుకున్నాడు. "ఒసేయ్ నిజంచెప్పు. ఎక్కడినుంచి వస్తున్నావు. వాడితో సరసాలాడి వస్తున్నావుటే," నాలుగు గుద్దులు గుద్దినాడు. "ఈ వాళ నిన్ను బలేస్తాను తెలుసా" "అయ్యో అమ్మ నన్ను వదిలెయ్యరా బాబూ నీకు దణ్ణం పెడతాను. ఇవ్వాళ నేను పనిచేసే ఇంటి ఆమె యజమానుడు చాలా ఆలస్యంగా ఇంటికొచ్చాడు. ఆమెకు ఇంతసేపు నేను తోడు వుండాల్సి వచ్చింది. నమ్ము నిజము చెప్పేను, ఇంక విడిచిపెట్టు" అని దీనంగా ఏడుస్తోంది వెంకి.

"అమ్మ దొంగా ఎంతలేని అబద్ధాలుకూడా నేర్చావూ! నీ మాయ మాటలు నమ్ముతాననుకున్నా. ఈ పోలిగాడెవరనుకున్నావ్. నీ పాలిటి రెండో యముడు. నిజముచెప్పు. వాడెవడో ఇప్పుడెక్క-

దున్నాడో చెప్పు. చెప్పుతావా! లేదా!" అని తన్నడం మొదలెట్టాడు. దెబ్బలకు తాళలేక వెంకి క్రింద పడింది. దాని కడుపు కాలుతో అదిమి, రెండు చేతులతో దాని గొంతు నొక్కాడు. కసి తీరిపోయింది. చేతులు దులుపుకున్నాడు. వెంకి నోట్లో మాటలేదు. కళ్లు మూతబడ్డాయి. చచ్చిన పీనుగలాగుపడివుంది.

వెంకి లేవకపోవడముచూచి చెయ్యి పట్టుకుని ఎత్తినాడు. ఎత్తిన చెయ్యి ఎత్తినట్టే క్రిందపడింది. పోలిగాడికి త్రాగుడుమత్తు పూర్తిగా తీరింది. మరల ఒకసారి ఇటున్న ముఖము అటు త్రిప్పాడు. ముక్కు దగ్గర చెయ్యిపెట్టి చూచాడు. వూపిరి ఆడలేదు. గుండెలు అంటి చూశాడు. కొట్టుకోడంలేదు. అంత వాడికి భయము దుఃఖము పొంగి పొరిలింది.

"అయ్యో వెంకీ నిన్ను చేతులారా చంపేశాను. అయ్యయ్యో నాగతేమి, ఇంకెప్పుడిలా చెయ్యను. అయ్యో నన్ను చూడు, కళ్లు తెరు, అయ్యో నా వెంకి," అని భోరున ఏడువ నారంభించాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన కట్టెలదొడ్డి యజమానుడుకి ఇదంతా చూచి భయము ఆశ్చర్యము వేసింది. "ఒరేయ్ పోలిగా నీపెళ్లాన్ని చంపేశావా? అయ్యో సీతమ్మ లాంటిది. ఆఖరికి నీ చేతులోపడి చచ్చిపోయిందా. ఇప్పుడే పోలీసుకు రిపోర్టు చేస్తాను," అని చరచరా నడిచివెళ్లిపోయాడు.

ఈ మాటలు వినగానే పోలిగాని ఏడుపు హటాత్తుగా ఆగిపోయింది.

"హా! నాపెళ్ళాం పతివ్రతనా! సీతమ్మ లాంటిదా! అది చెడిపోలేదా! మరి-మరి వీడే కదా నాకు లేనిపోని అనుమానాలు నూరిపోశాడు. ఇప్పుడు వీడినోటెంబడే ఇదంతా వింటున్నానా. ఆ అంతా తెలిసింది. మోసం, మోసం ఆ పాపాత్ముడి మాటవిని నిన్ను అనుమానించాను. అదే నన్నింతకి తెచ్చింది. అయ్యో వెంకీ ఒక్కసారి నోరుతెరిచి నన్ను క్షమించానని చెప్పవూ అని మరల వెక్కి వెక్కి ఏడవసాగినాడు. ఇదంతా ఏమి అర్థం కాని ఆ మూడేండ్ల బిడ్డడు తన తల్లిని ఎత్తుకోమని చెప్పి తన చిన్ని చేతులతో తట్టిలేపి ఆమె లేవనందుకు మరింత గట్టిగా ఏడుస్తున్నాడు.

ఇంతలో కట్టెలదొడ్డి యజమాని, వాని వెంబడే ఇద్దరు పోలీసు జవానులు వచ్చారు. పోలిగాడికి సంకెళ్లు తగిలించి స్టేషనుకు లాక్కుపోతున్నారు. తల్లి ఎత్తుకోనందుకు, తండ్రికూడా వెళ్లిపోతున్నందుకు, ఆ బిడ్డడు పెద్దపెట్టున గుండె నీరవునట్లు ఏడుస్తున్నాడు.

ఇన్స్పెక్టరు:- ఏయ్ నీపేరేమి?

పోలిగాడు:-పోలిగాడండి.

ఇన్స్పెక్టరు:-నీ భార్యను నీవే చంపినావా?

పోలిగాడు:-"చిత్తము. ఇదుగో ఈయనే నాకు నా పెళ్లాంమీద లేనిదంతా చెప్పి నమ్మించి చేతులారా చంపించాడు" అన్నాడు కోపముతో కట్టెలదొడ్డి యజమానుని వంక చూపిస్తూ.

ఇన్స్పెక్టరు: ఏయ్ నోరుముయ్. నీ పెళ్లాన్ని హత్యచేసింది కాకుండా ఆ పెద్దమనిషిని అవమానిస్తావా. దానికి ఫలితము అనుభవించు. నంబర్ 304, నంబర్ 102. వీడ్ని తీసుకెళ్లి బాగా తన్నండి.

వెంటనే ఇద్దరు పోలీసు జవానులు వాడ్ని తీసుకెళ్లారు.

"అయ్యో, అమ్మో, బాబో" అని అరుస్తున్నాడు పోలిగాడు దెబ్బలకి. "అమ్మ గాడిదకొడకా. ఒకటి పెళ్ళాన్ని చంపావు; రెండవది ఒక పెద్ద మనిషిని అవమానించావు. అమ్మో, అబ్బో, అంటావా? రేపీపాటికి వురికంబాని వేలాడుదువుతే. అంతవరకు చచ్చినకుక్కలాగుండు." అని మరల నాలుగు దెబ్బలు వేశాడు. ఇంతలో "ఆగండి, ఆగండి నేను బ్రతికే వున్నాను" అని కేక వినిపించింది.

ఇన్స్పెక్టరు తిరిగి చూచాడు. వెంకినిచూచి ఆశ్చర్యపోయాడు. "ఆయన్ని కొట్టకండి, ఆయ

నేమి తప్పుచెయ్యలేదు. నేనే ఇవ్వాళ అంబలిలో చిలుముపడింది చూడకుండా త్రాగివేశాను, మైకము వచ్చింది, వాంతి అయ్యింది, వెంటనే అలా కొయ్యబారిపోయాను. నేనలా వుండటంచూచి ఆయనకి మతిభ్రమించి తనేనన్ను చంపేశాడని చెప్పుకుని ఏడ్చాడు - అంతే. ఎవరోపడనివాళ్లు లేనిపోనివి చెప్పుతారు. అవన్ని నమ్మకండి. నేను బ్రతికే వున్నాను. ఇంక ఆయన్ని విడిచిపెట్టండి" అని బ్రతిమాలింది వెంకి.

వెంటనే ఇన్‌స్పెక్టరు పోలిగాడ్ని తీసుకొచ్చిన జవానులనుపిలిచి, "మీరు చచ్చిపోయిందని చెప్పిన ఆడది ఇదేనా?" అని అడిగాడు. "అవునండి" అన్నారు జవానులు. "ఒరేయ్ పోలిగా నీ పెళ్లాం చెప్పిందంతా నిజమేనా?" "అవునండి" అని తల వూపాడు.

సరే ఇంక మీరిద్దరు పోవచ్చును. కేస్ డిస్‌మిస్ చేస్తున్నాను. ఈ సందడిలో మెల్లగా జారిపోయాడు కట్టెల దొడ్డివాడు. పోలిగాడు వెంకి ఇంటివైపు నడిచారు.

ఇంటికి రాగానే పోలిగాడు వెంకి రెండు చేతులు పట్టుకుని, "వెంకీ నువ్వు ఇంత బుద్ధిమంతురాలవని అనుకోలేదు. నిన్ను చాలా బాధపెట్టాను. ఇంక నీపైన ఎవరైనా ఏదిచెప్పినా నమ్మను, వినను. త్రాగుడు ముట్టుకోను. నన్ను క్షమించవూ?" అన్నాడు పశ్చాత్తాపముతో. "చాల్లే పిచ్చి మామయ్యా వూరుకో. ఇంకన్నా బుద్ధిగావుండు. అదే నాకు పదివేలు" అనింది వెంకి.

పోలిగాని మట్టి బుర్రకి ప్రేమ అంటే ఏమిటో ఇప్పుడు బాగా అర్థమైంది. వీళ్ల మాటలంతా తెలుసుకున్నట్లు కిలకిలా నవ్వాడు వెంకి ఒడిలోని పాపాయి.

వారము రోజులు గడిచింది. ఆ రోజు దీపావళి. వెంకి 3 గంటలకేలేచి స్నానముచేసి, దోసెలుకాల్చి కూర వండింది. పెనిమిటిని కొడుకును లేపి తలంటిపోసి దోసెలు కూర వడ్డించింది. వాళ్లు ఇద్దరుతిని లేచాక తనుకూడా దోసెలుతిని, వకీలుగారింటి పనికి వెళ్లింది. అప్పటికి సరస్వతమ్మ లేచి స్నానముచేసి తల ఆర్చుకొంటూంది, వంటామె పిండివంటలు చేస్తూంది.

వెంకిని చూస్తూనే సరస్వతమ్మ "రా వెంకి రా. ఈవాళ మీఇంట్లో దీపావళి బలంగా వున్నట్టుందే" అనింది. "అవునమ్మగారూ మీరు చెప్పిన యుక్తి అచ్చరాలా ఫలించింది. ఆ రోజు మీరు చెప్పినట్లు అరగంటసేపు వూపిరి బిగబట్టి చచ్చిన పీనుగులాగా పడివుండినాను. అబ్బా లేకపోతే మా ఆయనకు ఈ జన్మంలో బుద్ధివచ్చేదికాదు. ఈ రోజు దీపావళి అని తెలిసికూడా కల్లు ముట్టుకోలేదు. మీ దయవల్ల ఇప్పటికి నా బ్రతుకు తెల్లవారింది. ఇప్పటికి నాసంసారము సుఖంగా సాగుతుంది." అని చెప్పి తనపని చూడటానికి లోపలికి వెళ్లింది వెంకి.

# ★ మహాలక్ష్మి చేసిన తప్పు ★

శ్రీమతి చిన్నమ్మాయి

మహాలక్ష్మి నలుగురు మగవాళ్ల సందున పుట్టిన ఒక్కగా నొక్క కూతురు కనుక ఆమెను అన్నతమ్ములంతా అమిత గారాబంగా చూస్తూవచ్చారు తల్లి తండ్రులతో పాటు. అంత మాత్రాన మహాలక్ష్మి అల్లరి చిల్లరగా తిరిగి ఎవరి మనసులకును ఎటువంటి బాధనూ కలిగించలా. వినయ విధేయలతో చిన్నతనంలోనే సంచరిస్తూ వస్తున్న మహాలక్ష్మిని చూచి ఇంట్లోవాళ్లే కాక వూళ్లో వాళ్లుకూడా మురిసిపోయేవారు. ఒక్క కూతురైతే మాత్రమేం అటువంటి బిడ్డను కన్నందుకు నర్సయ్యా, నర్సమ్మలు అదృష్టవంతులన్నారు అందరు.

మహాలక్ష్మికి యుక్తవయస్సు వచ్చేసరికి నర్సయ్యా భార్యతోసహా పరలోక యాత్ర చేశాడు, వివాహాలైన నలుగురు కొడుకులతోపాటు కూతురును వదలి. చచ్చిపోయే ముందు పెద్దకొడుకుని పిలిచి "మహాలక్ష్మిని నీ బిడ్డమాదిరిగా చూచి దాన్ని ఒకింటి దాన్ని చేయమని" చెప్పాడు. వెంకయ్యా "సరే" నని తలూపాడు.

నర్సయ్యా బీదవాడు అనే విషయం వూరిలోని వారందరికి తెలుసు. అయితే ఆయన ఏనాడు తిండికి కొంచెముకూడా బాధ నిరుత్సాహం, నిస్పృహా చెందకుండా నిత్యం ఒళ్లొంచి పనిచేశాడు. కొడుకులు పుట్టక ముందు, తరువాత బిడ్డలకు ఈడొచ్చేసరికి, వారిని జీతాలకు కుదిర్చాడు. అక్కడనుండి ఆయనకు కొంచెం విశ్రాంతి లభించసాగింది. మొత్తంమీద కొడుకులు సంపాదించిన దానితోనే వారి నలుగురికి సక్రమంగా పెండ్లిండ్లుచేసి వాళ్లను ఒక ఇంటివాళ్లగాచేసి మరిపోయాడు.

నర్సయ్యా కొడుకులు నలుగురు తండ్రి చనిపోకమునుపే విడిపోయారు. పెద్ద కొడుకు వెంకయ్యకు తనదగ్గరవున్న రెండు వందల రూపాయలు కూతురుతో పాటు ఇచ్చిపోయాడు కాబట్టి మహాలక్ష్మి ఇప్పుడు పెద్దన్నదగ్గరనే వుండసాగింది. అన్నను గౌరవించినరీతిగానే పేరమ్మను కూడా గౌరవించసాగింది. పేరమ్మకూడా మహాలక్ష్మినికన్న కూతురుగానే చూచుకోసాగింది.

కొన్ని నెలలు గడవకుముందే వెంకయ్యా సంసారంలో కలతలుమొలకలెత్త సాగాయి. వెంకయ్యా ఒక్కడే సంపాదించుకొచ్చింది ఈ కరువుకాలంలో వారి సంసారానికి చాలటం కష్టమైంది. ఈ విషయం అన్న చెప్పక పోయినా వదిన అనకపోయినా మహాలక్ష్మి గ్రహించింది. ఒకనాడు వెంకయ్యా దగ్గరికి వెళ్లి "అన్నయ్యా! నేనుకూడా కూలికి

వెళ్తా. నీ వొక్కడవు తెచ్చిపెట్టుంటే మేం తింటూ కూర్చుంటే ఏమాత్రంకూడా మనం ముందుకు సాగలేం" అంది వినయంగా. "ఆ - ఎందుకమ్మా! నీవు కూలికివెళ్లుట, నీమనస్సుకేమైనా వ్యధమకలిగేటట్లు నేను కాని, మీ వదిన కాని అనలేదు కదా!"

"నిన్నటి దాకా కూలిచేసిన దాన్నేగా. నేనేమైనా సుకుమారంగా పెరిగిన దాన్నైతే చేయలేనని భయం. కష్టజీవులకు పనిచేయట మంటె భయంకాదు. వారికి కష్టం ఎప్పుడూ ఒకేరీతిగా వుంటుంది. వారికి దానిలో, కొత్తకాని, అధికంకానికనపడదు. నన్ను వదినకాని, నీవు కాని ఒక్కమాటకూడా అనలేదని నేచెప్పేకన్నా చూచినవాళ్లే అనుకుంటారు. అయితే ఏమంటావు అన్నయ్యా!"

"చూద్దాము. కొంచెం నిదానించు" అన్నాడు అయిష్టతను దాచిపెడ్తూ వెంకయ్య.

వెంకటరత్నంగారంటే ఆ వూరిలో గొప్ప ఆస్థిపరుడని ఆ చుట్టుపట్ల నాలుగైదు వూళ్లకి తెలుసు. ఆయనకు చక్కని భవంతి, ఒక గొడ్ల చావడి (పెంకుటి) కూడ వుంది. అయన క్రింద అనేకమంది పనివాళ్లున్నారు పనులు చేస్తానికి. అంత ధనవంతుడైనా అయనఅంటే అందరికీ అసహ్యమే కాని ఎవరు దాన్ని పైకి పొంగనీయలా—మనస్సుల్లోనే ద్వేషించసాగారు చిన్నా పెద్దాఅంతా. బిచ్చగాడికి పిడికెడు మెతుకులు వేయించిన పాపాన ఏనాడు పోలా. పైగా అడుక్కొనే వాళ్లువస్తే వాళ్లజోలెలు లాక్కొని వాళ్లచేత ఏవైనా పనులు చేయించుకుంటాడు. అందువల్ల ఆ యింటి ప్రాంతాలకు బిచ్చగాళ్లెవరూరారు.

భార్య చచ్చిపోయేసరికి వెంకటరత్నం వయస్సు సుమారు ఏబదిఐదు సంవత్సరాలుంటాయి. నలుగురు ఆడపిల్లలు ముగ్గురు మగబిడ్డలువున్న కారణంగా మళ్లా వివాహం చేసుకోటానికి కొంచెం జడిశాడు. అంతేకాని ఎవరూ పిల్లనూ ఇవ్వరనేభయం ఆయనకు ఏకోశానలేదు, మరొక విషయమేమిటంటే ఆస్థి ఈ పిల్లలకు చాలదనే భావం ఆయనలో గాఢంగా నాటుకుపోయింది. అసలు ఈ కారణంవల్లనే పెళ్లి చేసికోనన్నాడు ఎంత మంది చెప్పినా. ఆయనీ విషయంలో అందరూ అనేక విధాలుగా చెప్పుకోసాగారు.

వెంకట రత్నానికి ఇప్పుడు ఇంట్లో పనులు చక్కపెట్టడం మహాపసగావుంది. ఎలాగైనా 'ఇల్లాలులేని ఇల్లు చమురులేని దీపమే.' ఏవస్తువు ఎక్కడ పెట్టాలో, ఏది ఎలా చేయాలో (ఇంటిలో) అది ఒక్క స్త్రీకే చేతవుతుందిగాని మరెవరికి సాధ్యం కాదు. అందులో పెద్దపెద్ద ధనవంతుల ఇళ్లలో మరీ దుస్సాధ్యం. ఈ విషయం గ్రహించాడు వెంకటరత్నం. ఒక పని

మనిషిని పెట్టుకుంటేనేకాని తన కుటుంబం బాగుపడదనుకున్నాడు. మగపిల్లలు ఆడపిల్లలకన్న పెద్దవాళ్ళేకాని వాళ్లు ఒక్కపని కూడా చేయరు. తల్లి వున్నంతవరకు కొద్ది కొద్ది పనులు చేయటానికి చిన్నపిల్లను ఒకదాన్ని పెట్టుకున్నారు. జీతం సరిగ్గా ఇవ్వని కారణంగా ఆ అమ్మాయి సరిపించుకుంది. ఇప్పుడు మళ్లా అవసరమైంది. ఇదివరకటికన్న ఇపుడు ఎక్కువ అవసరం. పిల్లలవల్ల కానిపనులు అనేకాలున్నాయి.

వెంకయ్య ఒక సంవత్సరం వెంకటరత్నం దగ్గర పనిచేశాడు పాలేరుగా. అప్పుడు అతనిమీద ఆయనమీద బాగా నమ్మకం కుదిరింది. అభిమానంకూడా ఏర్పడింది. మరుసంవత్సరంకూడా వుండమంటే జీతం చాలదని విరమించుకున్నాడు. అప్పటి నుండి వెంకట రత్నానికి వెంకయ్య వాళ్ల కుటుంబంపైన ఒక విధమైన గురి ఏర్పడింది.

మహాలక్ష్మి బలవంతంపైన వెంకయ్య ఒప్పుకున్నాడు వెంకట రత్నంగారింటిలో పనిచేస్తానికి. పేరమ్మకుకూడా ఇష్టంలేదు మహాలక్ష్మి పనిచేయటం. అయినా మహాలక్ష్మి "ససేమిరా" అని పట్టు పట్టింది. "సరే! జాగ్రత్తగా తిరుగుతూ పనిచెయ్యి. ఏ పొరబాటు చేయకండా స్వంత గృహంలో పనిచేసినట్లు పనిచేసి మనకు అపనిందతేబోకు. నలుగురు నోళ్లలో నానేటట్లు చేయవద్దు" అని బుద్ధులుగరపి చెల్లెల్ని వెంకటరత్నంగారింటిలో కుదిర్చాడు వెంకయ్య. వెంకయ్య మొదట సంతోషించకపోయినా తరువాత సంతసించాడు చెల్లెలు నీడపట్టున సుఖపడుతుందని పాపం.

మహాలక్ష్మిమీద మాతృప్రేమకోసం తహతహలాడిపోయే పిల్లల లేతహృదయాలకు మమకారం ఏర్పడింది. ఆమెను గౌరవంగా పిలుస్తూ, మర్యాదగా పనిచేయించుకుంటూ వచ్చారు. మహాలక్ష్మికూడా పిల్లలను ఏలోపంలేకుండా చూడసాగింది. వెంకటరత్నం తన కుటుంబాన్ని చక్కగసరిదిద్దిపెట్టే పనిమనిషి లభించినందుకు అమితంగా ఆనందించాడు. మెల్లమెల్లగా ఆమెమీద అనుమానం దూరమైంది, అభిమానం ఎక్కువైంది.

సాఫీగా నడచిన కాలశకటం ఒడుదుడుకుల్లో ప్రవేశించింది. ప్రయాణం ప్రయాసగావుంది. వెంకటరత్నం బుర్రలో చీడపురుగు చేరింది. బుద్ధిపెడత్రోవకు బయలేరింది. ఇది సహజమే - భార్యలేదు. అందులో రుచులెరిగిన వ్యక్తి, అదిగాక కళ్లెదుట మెరపుతీగెలాంటి యౌవనవతి వుంది. మరికళ్లు జిగేలు మనక ఏంచేస్తాయి! మహాలక్ష్మిమీద వెంకటరత్నానికి చెడు అభిప్రాయం ఏర్పడింది. జారిపోయిన నల్లని చిన్నిపూస దొరకటం దుర్లభం. ఇక ఆ సంవత్సరంతో ఆఖరు - మహాలక్ష్మికి పెండ్లి చేయాలనుకుంటున్నారు. రెండు

సంవత్సరాలనుండి పనిచేస్తుంది. ఇంతవరకు తాపాన్ని సహించి వూరుకున్నాడు. ఇక వుండలేకపోయాడు. "మహాలక్ష్మీ! నిన్నొకటి అడుగుతాను ఏమనుకోవుగా" అన్నాడు మెల్లగా వంటిగదిలో పనిచేసుకుంటున్న మహాలక్ష్మిని సమీపించి.

"ఏమిటండి! అది చెప్తే నావల్లనైతే కాదంటానా" అన్నది కూర్చున్నదల్లా లేస్తూ.

"పరవాలేదు కూర్చోలే! ఏమీలేదు- నిన్ను చూస్తుంటే నాకు ఒక విధమైన ప్రేమ పుట్టుకు రాసాగింది. నిన్ను ఎన్నోసార్లు అడుగుదామని వచ్చానుకాని అడగలేకపోయా" అని మెల్లగా గొణగసాగాడు. ఆయన మాటలు మహాలక్ష్మికి సరిగ్గా అర్థంకాలా. ముఖభావంతో నిండిన మాటలను అర్థంచేసుకోలేక పోయిందా అమాయకురాలు. "మీరనేదేమిటో నాకు సరిగ్గా తెలియలా. అసలు విషయమేమిటో వివరంగా చెప్పండి" అంది విసుగ్గా. "ఏమీ లేదు నిన్ను ... ... అనుకున్నా, ఏమంటావు నామాట కంగీకరించావంటే నీవేది కోరితే అది చేయించిపెడ్తా-సరేనా!"

మహాలక్ష్మి ఇపుడు తెలుసుకుంది వెంకటరత్నం వుద్దేశం. ఆయన అటువంటి మనిషని ఇదివరకెప్పుడూ అనుకోలా. కలలో కూడా ఆయన మంచివాడు కాదని ఆమె తలంచలా. చప్పున కోపం వచ్చింది. నెత్తురు గడ్డకట్టింది. ఇక వుండలేకపోయింది.

"మీరిప్పుడంటే అన్నారుకాని మరెప్పుడన్నా అనేరు. నేను కూటికి పేదనైనా శీలానికి పేదనుకాను. నేనెప్పటికి అంగీకరించను ఆ విషయానికి. మీబిడ్డగా భావించి నామీదనున్న వాంఛను త్రుంచివేసికోండి" అని బ్రతిమిలాడింది.

'మహాలక్ష్మీ! కాళ్లదగ్గరకొచ్చిన పెన్నిధిని తృణప్రాయంగా నీకాళ్లతోనే తన్నివేస్తున్నావు. ఒక్కసారి "ఊ' అన్నావంటే నీవు యావజ్జీవం సుఖపడ్తావు. లేకపోతే..." "లాభంలేదు, నన్ను కనికరించి నామీద కక్షకట్టకండి. మిమ్మల్ని ప్రార్థిస్తున్నా."

"నామాట కాదన్న [illegible] తిరస్కరించి నాకు కోపాన్ని తెప్పించావంటే నీగతి ఏమౌతుందో ఆలోచించావా మహాలక్ష్మీ!" అన్నాడు కోపంగా.

అనేక విధాల బ్రతిమిలాడింది, ప్రార్థించింది, కోపించింది, ద్వేషించింది. ఎన్ని ప్రయత్నాలుచేసినా వెంకటరత్నం పాషాణ హృదయం కరగలా.

"ఇప్పుడేం కాదు. ఇంకా రెండురోజులు గడువు ఇస్తున్నా, బాగా ఆలోచించుకో" అంటూ వెళ్లిపోయాడు విసురుగా వెంకటరత్నం.

మహాలక్ష్మి బాగా దీర్ఘంగా ఆలోచించింది; ఉపయోగం కనపడలా. ఎంత ప్రార్థించినా వినేటట్లు కనపడలా. ఇక అక్కడవుంటే మానభంగం జరుగుతుంది. అదితప్పదు. అందువలన వెంటనే ఇంటికి వెళ్లిపోయింది దిగులుగా

 

శ్రీరాములుగారు ఆవూరికి పెద్ద. ఆయనమాట దాటిపోవటానికి ఎవరికీ ధైర్యం లేదు. తప్పుకాని ఒప్పుకాని ఆయన చెప్పినట్లు వినాలి. ఆయన కచేరి అరుగుమీద కూర్చుని తీర్పు చెపుతుంటే అందరూ తలొగ్గే వారేకాని తలెత్తేవాళ్లు లేరు.

శ్రీరాములు, వెంకటరత్నం వరుసకి బావా బావమరుదులు అవుతారు. కాని వెంకటరత్నంకన్న శ్రీరాములు కొంచెం నయం.

శ్రీరాములుగారు వెంకయ్యను కచేరి అరుగు దగ్గరకు పిలిపించాడు రెండవరోజు సాయంత్రం.

వెంకయ్య రాగానే "వెంకయ్యా! నీ చెల్లెలు ఇప్పుడు వెంకటరత్నంగారింటిలో మానుకున్నది ఎందుకు?" అని ప్రశ్నించాడు శ్రీరాములుగారు. వెంకయ్య చెప్పాడు వెంకటరత్నం చేసినపని. అది పొంతం చెప్పకముందే "ఇక ఆపు నీ మాటలు. వెంకటరత్నం అటువంటివాడు కాదని నీకెలా తెలియాలా!? నీ చెల్లెలు చేసినపనివేరు. వంకెన చొక్కా జేబులో పెట్టినడబ్బు కాజేసి ఈ ఉపాయం పన్నిందని తెలుసా? తెలిసే తెలియకుండా అలా చెప్పావంటే మర్యాదగా వుండదు జాగ్రత్త" అన్నాడు కోపంగా శ్రీరాములు. "మా అమ్మాయి అటువంటిది కాదండి" అన్నాడు వినయంగా. "అయితే వెంకటరత్నమేనా అటువంటివాడు" అన్నాడు ఎద్దేవగా. వెంకయ్య ఇక ఎంత చెప్పినా లాభంలేదనుకున్నాడు. తనకు న్యాయం దొరకటం కష్టమేనని నిశ్చయించుకున్నాడు. శ్రీరాములుగారు చెప్పింది తీసివేయడానికి ఎవరికి చేతకాదని తెలుసుకున్నాడు.

"వెంకటరత్నం ఎంతడబ్బు పోయింది నీ జేబులోది?" అని ప్రశ్నించాడు వెంకటరత్నంవైపుతిరిగి శ్రీరాములు.

"నలభై రూపాయలండి. పదిరూపాయలనోట్లు నాలుగుకలిపి జేబులో పెట్టి చొక్కా వంకెన తగిలించా. ప్రొద్దున చూచుకుంటేలేవు. మాపిల్లలు అటువంటివాళ్లు కారు. ఇంతవరకు ఎప్పుడూ చేయనివాళ్లు ఇప్పుడు చేస్తారా? ఇది తప్పకుండా మహాలక్ష్మి చేసినపని" అన్నాడు. అందరికి నమ్మకం కుదిరేటట్లు వెంకటరత్నం.

"ఏమోయి వెంకయ్యా! దీనికి నీవేమంటావు? ఆ ఇంట్లోకి ఇంకా పరాయివాళ్లు ఎవరూ పోరాయె. అటువంటప్పుడు ఆ డబ్బు ఎగిరిపోతుందా! నీవే చెప్పు."

"మీరే చెప్పండి న్యాయం" అన్నాడు వెంకయ్య ఇక ఏంచెప్పినా వృధాయని.

"న్యాయమేముంది, మీ చెల్లెలు కాజేసినట్లు స్పష్టంగా తెలుస్తుంటే. కాబట్టి ఆ నలభై రూపాయలు తీసికొచ్చి రేపు ఇచ్చెయ్యండి. లేకపోతే బాగుండదు" శ్రీరాములుగారి "తీర్పు"కు అంతా సంతోషించారు, వెంకటరత్నంతోపాటు. ఆయన్ని "న్యాయమూర్తి" అన్నారు. వెంకయ్య మాత్రం న్యాయం దొరకనందుకు విచారించాడు పాపం.

# కార్మిక స్త్రీల శ్రేయస్సు పట్ల సోవియట్ ప్రభుత్వపు శ్రద్ధాసక్తులు

మేరియా ఇల్లీనా

సోవియట్ దేశంలో ప్రభుత్వ, ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, రంగాలన్నిటిలోనూ స్త్రీలు పురుషులతోబాటు సమాన హక్కుల ననుభవిస్తున్నారు. ఈనాడు ఫాక్టరీలలోనూ, మిల్లుల్లోనూ, రవాణా, నిర్మాణ, వ్యవసాయ రంగాలలోనూ స్త్రీలు పనిచేస్తున్నారు; సామ్యవాద మహావిప్లవానికి పూర్వం స్త్రీలకు అందుబాటులో లేని పనులన్నీ వారీనాడు చేస్తున్నారు. ఉదాహరణకు పూర్వం మెటల్ టర్నర్ పని పురుషులు మాత్రమే చేసేవారు; ఈనాడు యీవృత్తిలో వేలకొద్ది యువతులు నిపుణులుగా నున్నారు. ప్రతి పనినీ మంచి గుణవంతంగా చేయడానికి సామ్యవాద పోటీవుద్యమాన్ని ప్రారంభించినందుకు ల్యుబ్లినో ఫాక్టరీ అండ్ ఇంజినీరింగ్ వర్క్సుకు చెందిన ఆంటోనియా జందారోవా, ఓల్గా సడోవ్స్కావా అనే ఇద్దరు టర్నర్లు దేశమంతటా కీర్తిగడించేరు.

ఈనాడు వేలకొద్దీ సోవియట్ స్త్రీలు డిజైనింగ్ ఇంజినీర్లుగానూ, టెక్నాలజిస్టులుగానూ, షాపు సూపరింటెండెంట్లుగానూ, ఫోర్‌మన్లుగానూ, దళనాయకులుగానూ, ట్రాక్టర్ డ్రైవర్లుగానూ, కంబైన్లు, ఇతర ఆధునిక వ్యవసాయ యంత్రాల ఆపరేటర్లుగానూ పనిచేస్తున్నారు. సోవియట్ స్త్రీలు చురుగ్గా పాల్గొనని ఆర్థికశాఖగాని, రాజకీయ, పౌరకార్యకలాపాలుగానిలేవు.

పనికీ, విశ్రాంతికీ, వినోదానికీ, సాంఘికభీమా, విద్య మొదలైన వాటికీ పురుషులతోబాటు స్త్రీలకు సమాన హక్కులనిచ్చి, సమానమైన పనికి సమాన వేతనమనే సూత్రాన్ని అమలుజరపడమే కాకుండా సోవియట్ ప్రభుత్వం స్త్రీల శ్రమనూ, తల్లీ పిల్లల శ్రేయస్సునూ ప్రత్యేకంగా కాపాడుతుంది; స్త్రీల శ్రమనూ, వారి ఆరోగ్యాన్ని కాపాడడానికి సోవియట్ ప్రభుత్వం అనేక చట్టాలు చేసింది; అతికష్టమైన పనులకు, భూగర్భపు పనులకు స్త్రీలను నియమించడం నిషేధింపబడింది. ఇతరపనుల్లో అవసరమైనప్పుడు స్త్రీలకు ప్రత్యేకమైన, సుఖవైన, పని పరిస్థితులు కల్పించబడతాయి; కార్మిక స్త్రీపని తేలిక చెయ్యడానికి ప్రత్యేక యంత్ర సాధనాలు ఏర్పాటు చెయ్యబడతాయి.

పారిశ్రామిక కార్మికులుగానూ, గుమాస్తాలుగానూ పనిచేసే కార్మిక స్త్రీలందరికీ ప్రసవానికి ముందు 35 రోజులు, తరవాత 42 రోజులు ప్రసూతి సెలవు లభిస్తుంది; అసాధారణమైన ప్రసవం కలిగినప్పుడుగాని, కవలలు పుట్టినప్పుడుగాని ప్రసవం తరువాత ప్రసూతి సెలవు 56 రోజులకు పొడిగింపబడుతుంది. ఈ ప్రసూతి సెలవల్లో కార్మిక స్త్రీకి ప్రభుత్వ భీమానిధినుండి వేతనం లభిస్తుంది; ఈ వేతనం సాధారణంగా ఆమె మామూలు జీతానికి సమానంగా వుంటుంది. గర్భిణీ స్త్రీలుగాని, పాలు తాగే పసిబిడ్డలున్న స్త్రీలుగాని రాత్రుళ్లు పనిచేయడానికి వీలులేదు; అలాగే 18 ఏళ్లకులోపు యువతులుగూడా రాత్రుళ్లు పనిచేయడానికి వీలులేదు.

పాలుతాగే పసిబిడ్డలున్న కార్మిక స్త్రీలకు మధ్యాహ్నం భోజనానికి మామూలుగా ఒక గంట విరామంతోబాటు, పిల్లకి పాలివ్వడానికి అదనంగా విరామకాలం లభిస్తుంది; ఈ విరామకాలానికి వాళ్లసగటు వేతనాల రేటున డబ్బు చెల్లింపబడుతుంది. చట్టరీత్యా గర్భిణీ స్త్రీలనుగాని పాలు తాగే పసిబిడ్డలున్న తల్లులనుగాని పనిలోకి తీసుకోడానికి నిరాకరించడానికి వీలులేదు. అలాగే, యీమిషమీద వాళ్ల వేతనాలు తగ్గించడానికి వీలులేదు. ఈ చట్టాన్ని ధిక్కరించడం క్రిమినల్ నేరమవుతుంది.

సోవియట్ దేశంలో గర్భిణీ స్త్రీలకూ, పాలు తాగే పసిబిడ్డలున్న బాలింతలకు ప్రత్యేకమైన విశ్రాంతి మందిరాలున్నాయి. అక్కడ కార్మిక స్త్రీలకు ఉచితంగాగాని, నూటికి 70 పాళ్లు తక్కువ రేటుకుగాని వసతి లభిస్తుంది; ఈ ఖర్చులను ట్రేడ్

యూనియన్లు ప్రభుత్వ సాంఘిక భీమానిధినుండితీసి చెల్లిస్తాయి.

ఎక్కువగా స్త్రీలు పనిచేస్తున్న ఫ్యాక్టరీలవద్ద, ఆఫీసులవద్ద శిశురక్షణాలయాలు, శిశు శిక్షణాలయాలు వున్నాయి; తమ బిడ్డలకు పాలివ్వడానికి తల్లులకు ప్రత్యేక గదులున్నాయి.

పిల్లల శ్రేయస్సుకై అసంఖ్యాకంగా వున్న సంస్థలు పనిచేసే తల్లులకు ఎంతో తోడ్పడుతున్నాయి. తల్లిగర్భంనుండి బయటపడిన తొలి రోజునుండి బిడ్డ వైద్య సలహాకేంద్రం పర్యవేక్షణ క్రిందనే వుంటాడు; తల్లిపాలు కాక వేరే ఆహారం తీసుకోవలసిన దశవచ్చిన తరువాత బిడ్డకు క్షీరశాల పాలు సప్లయి చేస్తుంది. తల్లి పనికివెళ్లినప్పుడు శిశు రక్షణాలయం బిడ్డకు సంరక్షణ చేస్తుంది.

శిశు శిక్షణాలయాలు, పాఠశాలలు, బాలసంఘ భవనాలు, బాల సాంకేతిక కేంద్రాలు, ప్రకృతి ప్రియబాల కేంద్రాలు, సంగీత, కళాపాఠశాలలు, పిల్లల పార్కులు, స్టేడియంలు, ఆటల పాఠశాలలు, ఆటస్థలాలు, పిల్లల బొమ్మల నాటకశాలలు, గ్రంథాలయాలు, బాలసంఘ శిబిరాలు, - ఇవన్నీకూడా తన బిడ్డలను ఆరోగ్యవంతంగా, ఆనందంగా పెంచి పెద్దవాళ్లను చెయ్యడానికి పనిచేసే తల్లికి తోడ్పడడానికి ఏర్పాటు చెయ్యబడ్డాయి.

శిశు రక్షణాలయాల్లోనూ, శిశుశిక్షణాలయాల్లోనూ, బాలసంఘ శిబిరాల్లోనూ తమ బిడ్డల వసతికై తల్లిదండ్రులు అతి కొంచెం మాత్రమే డబ్బు చెల్లిస్తారు; చాలవరకు ఖర్చులన్నీ ప్రభుత్వమే భరిస్తుంది.

300 మందిగాని అంతకు ఎక్కువమందిగాని స్త్రీలు పనిచేసే ఫ్యాక్టరీలలో వారికి ప్రత్యేకంగా ఆరోగ్య గదులుంటాయి.

సోవియట్ దేశంలో పెద్దకుటుంబాలుగల తల్లులకీ, అవివాహితులైన తల్లులకీ ప్రభుత్వ ధనసహాయమూ, నెలవేతనాలు (ఎలవెన్సులు) లభిస్తాయి; ఇవి కార్మిక స్త్రీల పరిస్థితులను మెరుగుపరచడానికి తోడ్పడతాయి.

నూతన జీవిత నిర్మాణంలో చురుగ్గా పాల్గొంటూ, బిడ్డలనుపెంచి పెద్దవాళ్లనుచేసే పవిత్ర బాధ్యతను తల్లులుగా నిర్వర్తిస్తూన్న సోవియట్ స్త్రీలు అనునిత్యమూ తమ ప్రభుత్వ శ్రద్ధాసక్తులను చూరగొంటున్నారు.

"టాస్ నుండి"

## బంతులాట

మోమునఁ జిఱునవ్వుఁ బూలు పూచిన నేలఁ
బండు వెన్నెలనిగ్గు నిండఁబఱపి,
నిట్టూర్పుగాడ్పుల నీటువాటిలు చోటఁ
గమ్మని నెత్తావి గడలుకొలిపి,
లత్తుకపదము లలంకరించినవంక
నెత్తామరలపంట నెగడఁజేసి
నీలాలచూపుల చాలుప్రాలినసీమ
భ్రమరపంక్తుల తోరణములునిలిపి,
పైఁడియంచుల చెంగావి పైఁటకొంగు
కుసుమకోదండు బావుటాగుడ్డవోలె
తీవ నెగురఁగ, నందెల రావమెసఁగ
బంతులాడెను సతుల మేల్బంతియార॥

వేదము వేంకట కృష్ణశర్మ

## జీవితం



జీవితమాశా జనితం!
ఆశించిన దనుభవించుటానందం!
ఆనందం అందరికీ ఆశ్రయం!
ఆశ్రయించిన ఆనందాని కవసరం విజ్ఞానం!
విజ్ఞానానికి మూలం విద్యాధనం!
విద్యాధనానికి వినియోగించాలి ప్రయత్నం!
ప్రయత్నాన్ని విరమిస్తే నిష్ఫలమే జీవితం!

పోలాకి శ్రీనివాసరావు

# ఎందుకు వచ్చిన శ్రమ

మా శేషుకు లలితను పెండ్లాడాలని మహా మోజుగా నుండేది. కాని లలితకు మాత్రం శేషుమీద ప్రేమలేదు కారణం.

ఇద్దరూ చదువుకొన్న వాళ్లే. వేష భాషల్లో లలితకు శేషు ఏమాత్రం తీసిపోడు. శేషు తండ్రి ప్రభుత్వోద్యోగి. సాధారణ స్థితిమంతుడు.

శేషు లలిత ప్రణయభిక్ష కొరకు ఎంతో కాలము ఎదురు చూచాడు. ఒకరోజున లలితతో తన ప్రేమను తెలియజేస్తూ తన్ను వివాహ మాడమని కోరాడు. లలితకు ఏమిచెప్పి తప్పించుకోడానికి తోచక "సంగీత శాస్త్రంలో నేను మూడు ప్రశ్నలడుగుతాను; వానికి జబాబు చెప్పితే పెళ్లి చేసుకొంటాను'' అన్నది.

ఆ ప్రశ్నలకు జబాబు శేషుకు తెలిసింది కాదు. దానిని సాధించడానికి పడరానిపాట్లు పడి ఏసంగీత విద్వాంసుని దగ్గరనో చెప్పించుకొని లలితకు ఒప్పగించాడు.

"చాల బాగున్నది. నీకు సంగీతములో యింత జ్ఞానమున్నదని ముందే తెలిసినట్లయితే అప్పుడే నిన్ను పెళ్లిచేసుకోనని చెప్పేదానిని'' అన్నది లలిత.

♦ ♦ ♦

ఉదయం 8 గం. లకు కాంతం కాఫీ తీసుకొనివచ్చి బల్లమీద పెట్టింది. నాకు ఎదురుగా మా అమ్మాయిలు కనకమ్మ, రమాదేవి కూర్చోని కాఫీ త్రాగుతున్నారు.

శేషు రావడంచూచి ''బాబాయి నాన్నా!'' అంటూ పిల్లలు త్రాగేకాఫీ వదిలిపెట్టి గంతులు వేయడం మొదలుపెట్టారు.

కుర్చీ చూపించి ''కూర్చో శేషూ! ఏమిటి – ఏదో నీరసంగా కనిపిస్తున్నావు'' అన్నాను.

మరొక కప్పుకాఫీ తెచ్చి కాంతం అందిస్తూ, "ఏమిటి యీవేళ మామరది యిలాగున్నాడు! – వాళ్లనాన్న యింకా డబ్బు పంపలేదేమో'' నన్నది.

"మరి వదినెవునీవు! పాపం విచారిస్తేగా" అన్నాను.

శేషు కాఫీ త్రాగుతున్నాడే కాని మనసులో ఏదో బాధ పడుతున్నట్లు కనుపించింది.

"మీ నాయన యింకా పెండ్లిచేయలేదని ఏమయినా దిగులుపడ్డావా ఏమిటిరా! లలితను ఏదో చేసుకొంటావని విన్నాను. ఏమయింది" అన్నాను మెల్లగా.

"లలిత నన్ను చేసుకోడం లేదన్నది" అన్నాడు.

"ఏమిటీ— ఎందుకనట."

"సంగీత శాస్త్రంలో నన్ను కొన్ని ప్రశ్న లడిగింది వానికి జబాబు ఎక్కడనో సంపాదించుకొని పోయి చెప్పాను. నాకింత పాండిత్యమున్నందువలన తాను నన్ను వివాహమాడనన్నది" అన్నాడు శేషు.

"పోనీ చెప్పక పోయావా - ఆజబాబులు నీవి కాదని, ఎక్కడనో సంపాదించుకొని వచ్చినవని" అన్నాను.

"చెప్పాను అన్నయ్యా! అలాగైతే తన ఎదుట నిలువవద్దు పొమ్మన్నది" అన్నాడు.

శేషుకు కండ్ల వెంబడి నీళ్లు ఒక్కటే తక్కువ. మాకాంతం లోలోపల నవ్వుకొన్నది.

మా పిల్లలతో కొంతకాలం వెళ్లబుచ్చి శేషు వెళ్లిపోయాడు.

"ఎందుకు వచ్చిన శ్రమరా బాబూ" అనుకొంటూ సంచితీసికొని మార్కెటుకు బయలుదేరాను.

'సిసి'

# కింకర్తవ్యం?

ఏమిటి కర్తవ్యం?
ఏముందీ భవితవ్యం?
బియ్యంకుండ గాలించీ
మగని చింకిజేబుతడిమీ
తనడొక్కుపెట్టెని వెతికీ
దూలాలూ, గూళ్ళూ ఆశతో పరికించీ
ఆకలికరచెడు పిల్లలగోల భరించీ
ఆరణాల జీతగాడు తన భర్తరాకనువేచీ
ఆత్రంతో తిలకిస్తున్న
ఆ పేద ఇల్లాలికి
ఏమిటో కర్తవ్యం?
ఏముందీ భవితవ్యం?
తన కుటుంబమంతా సంపాదించిన
మొత్తం రూపాయ చిల్లరతో
పరుగుచ్చుకొని రేషన్ షాపుకి
మూసిన తలుపుల మూల్గుచుచూచి
కాళ్ళీడ్చుకొని కణకణమనుచు
వీధిమలుపున తిరిగొస్తున్న మగనిగాంచి
నిట్టనిలువున కృంగిపోయెడు ఆ తల్లికి

ఏమిటో కర్తవ్యం?
ఏముందీ భవితవ్యం?
తెచ్చిన నూకలగంజినికాచి
కొరకొరలనెడి బిడ్డల దాహాగ్నిని
కొద్దికొద్దిగ నార్పినాయమ
మగనికిసర్ది, మామకుపోసి
మిగిలిన గోకుడు చేతికితీసి
మగనితో వచ్చిన చుట్టాన్నిచూసి
వున్నదతనికి కర్పించిన ఆ తల్లికి
ఏమిటో కర్తవ్యం?
ఏముందీ భవితవ్యం?
పాలకోసరం పసిబిడ్డేడ్వగ
కూటికోసరం చంటిది ఏడ్వగ
కూలినాలీ దొరకని ఆరోజు
నిజనాథుడు మంచమెక్కిన సమయం
అన్నమన్నమని అల్లరిపిల్లలేగుర
అట్టెనిల్చిన ఆపుట్టదరిద్రురాలికి
ఏమిటో కర్తవ్యం?
ఏముందీ భవితవ్యం?

మిస్. నిరుపమ గురుకల్

ప్రకృతి వైచిత్రాలు—(1)

# — మానస సరోవరము —

శ్రీ బూషి రామదాసుగారు

మానససరోవరము హిమాలయ పర్వతములలోని ఒక సరస్సు. ఈ సరస్సును గురించి ఎంతోమంది కవులు అనాదినుండీ వర్ణిస్తూ వచ్చారు. హిమాలయ పర్వత సంక్తికి ఉత్తరంగాఉంది. మానస సరోవరము ఒకే సరస్సుగాదు. కొన్ని సరస్సుల కలయికనే మానస సరోవరమందురు.

బ్రహ్మపుత్రానది ఈ మానస సరోవరంనుండి పుట్టినదే. ఈ సరస్సు దాదాపు గుండ్రంగా నందనియే చెప్పవచ్చును. దీనియొక్క వ్యాసం దాదాపు 15 మైళ్లుంటుంది. ఈ సరస్సు హిమాలయ పర్వతములకూ, కైలాస శిఖరమునకూ మధ్యగా నుండుట వల్ల చాలా పుణ్యక్షేత్రముగాను, యాత్రాస్థలముగాను పరిగణింపబడుతుంది.

మనవేదాల్లోనూ, పురాణాల్లోను మానస సరోవరాన్ని గురించి, దాని మహాత్మ్యమును గురించి వ్రాయబడిఉంది. మనహిందూదేశమునుండి ప్రతి సంవత్సరము వేలకొలది జనులు యాత్రార్థమై ఈ సరస్సుకు పోతూ ఉంటారు. ఈ సరస్సులోని నీరు చాల స్వచ్ఛంగాను, నిర్మలినంగాను తళతళలాడుతుంటుంది. ఈ పవిత్ర సరస్సులో ఎవరైతే స్నానమాడెదరో వారు బ్రహ్మలోకమునకు చేరుదురు అని, ఈ సరస్సులోని నీటిని త్రాగినవారు కైలాసానికి పోవుటకు అర్హులనిన్ని ప్రజలు చెప్పుకుంటారు.

టిబెట్టువాసులుకూడ ఈ సరస్సు పవిత్రయాత్రాస్థలముగా పరిగణిస్తారు. టిబెట్టువారు, బౌద్ధమతస్థులు. వీరు దూరప్రాంతాలనుండివచ్చి, వారి ఆరాధన దైవాలను ఈ సరస్సు తీరంలో ప్రార్థిస్తారు. ఈ సరస్సు ఒడ్డున ఎనిమిది ప్రక్కల ఎనిమిది దేవాలయాలున్నాయి. ఈ సరస్సుకు ఉత్తరభాగాన్ని ఉన్న కైలాసశిఖరము 21,800 అడుగులయెత్తు. ఇక్కడ కనుపించు ప్రకృతిశోభ ప్రపంచంలో మరెక్కడాకూడ చూడజాలము. ప్రకృతి రామణీయానికి ఆటపట్టు ఈ సరస్సు పరిసర ప్రాంతం.

ఈ నదీతీరములో ఒక బౌద్ధమఠముకూడ ఉన్నది. ఈ మఠములోని బౌద్ధభిక్షుకులు చాల దయార్ద్ర హృదయులు. యాత్రికులకు ఎంతో సహాయం చేస్తారు. ఆ మఠంలోని బుద్ధవిగ్రహాలకు నిరంతరం నెమలి కుంచెలు పవిత్రతీర్థములో ముంచి చల్లుతూ ఉంటారు. ప్రతినిత్యమూ ఆ మఠంలో "ఓం ఆహాం" అను నినాదాలు మిన్నుముట్టుతూ ఉంటాయి. ఈ మఠం ద్వారంలోనుంచి చూస్తూంటే ఈ సరస్సు ఒక బ్రహ్మాండమైన అద్దంలాగ కనుపిస్తుంది. ఈ సరస్సులో ఇరుప్రక్కలనున్న పర్వత శిఖరాలు, ఆకసంలోని నీలిరంగు, మేఘములు ప్రతిబింబిస్తూ ఉంటాయి.

ఈ సరస్సులో నానారకాల పక్షులు కిలకిలలాడుతూ తిరుగుతుంటవి. ఒకపడవమీద తెరచాప విప్పి, ఈ సరస్సులో ప్రయాణం చేయడం చాల ఆనందంగా ఉంటుంది. దూరాన్ని కొండలు మంచుతోనిండి తెల్లగా నిగనిగలాడుతూ కనుపిస్తాయి. ఈ సరస్సుకు ప్రదక్షిణం చేయడమనేది చాల పవిత్రమైన విషయంగా ఆ బౌద్ధ సన్యాసులు తలంచెదరు. వీరు ప్రదక్షిణంచేస్తూ సరస్సుచుట్టూఉన్న దేవాలయాలవద్ద ఆగుతూ పోతూఉంటారు. మరికొంత

మంది, ప్రతినాలుగడుగులకూ సాష్టాంగంగా ప్రణమిల్లి మోకరింతురు. అక్కడ ప్రతినిత్యము యాత్రికులు తమ తలలు పైకెత్తి తీరాన్నిఉన్న కైలాస శిఖరమునకు నమస్కరింతురు. కైలాసము శివునికి నిలయమని మనం పురాణాల్లో చదివే ఉన్నాం.

ఈ సరస్సులో సాధారణంగా ఎవరిని పడవమీద ప్రయాణం చేయనియ్యరు. ఈ సరస్సు అడుగు భాగాన్ని, సరస్సును సంబంధించి దేవుడు నిరంతరం నిమీలితనేత్రుడై తపస్సులో ఉంటాడని, ఆ సరస్సు మీద పడవమీద ప్రయాణంచేస్తే ఆయనకు భంగం కలుగుతుందని వారి నమ్మకం. ఆ సరస్సు పరిసర ప్రాంతంలోగూడ చెప్పులు వేసుకొని తిరగనియ్యరు.

రెండువేల మైళ్ల పొడవైన బ్రహ్మపుత్రమహానది ఇచటనే పుట్టినది. బ్రహ్మపుత్రనదిని గురించికూడ మనం పురాణాల్లో చదువుతూ ఉంటాము. ఈ మానససరోవరమే ఈ నదికి పుట్టుకస్థానం. దైవచ్చింతా పరాయణులైన యాత్రికులు అవసానకాలంలో ఈ సరస్సు తీరానికివచ్చి, అచ్చటనేఉండి ప్రాణాలను విడిచెదరు. అందువల్ల శివుని సాన్నిధ్యమునకు అర్హులమగుదుమని వారి విశ్వాసము. నజరేతు 19 వందల సంవత్సరముల పూర్వంనుండి క్రైస్తవులకు యాత్రాస్థలమైతే, భారతీయులకు కొన్నివేల సంవత్సరాలుగా మానససరోవరము పవిత్రయాత్రాస్థానంగా పరిగణింపబడుతూ వస్తుంది.

ఈ సరస్సు పరిసర ప్రాంతం రాత్రులందు నిర్మానుష్యమై నిశ్శబ్దంగా ఉంటుంది. ఎక్కడో దూరాన్న నక్షత్రాలు మిణుకు మిణుకుమంటూ ఉంటాయి. తీరాన్నిఉన్న కైలాస శిఖరంమీద దృష్టినిల్పి ఆలోచిస్తూ ఉంటే, గుండె గభీలుమంటుంది. హృదయం ఎన్నో యడుగుల లోతుకు దించుకుపోతుంది. అప్పుడు ఆ వింతసోయగాన్ని, ఆ ప్రకృతి శోభను చూచినచో వళ్లుపులకరిస్తుంది, ప్రకృతి సౌందర్యానికి మనలో భయసంభ్రమాలు కలుగతవి. అప్పుడు మనం శక్తిహీనులంగా ఒక దీర్ఘంగా నిట్టూర్పును మాత్రం విడుస్తాము.

ఉదయం సమీపిస్తుంటే, మొట్టమొదట కైలాస శిఖరం తెలతెలవారుతూ వస్తుంది. ఆకసంమీద చిన్నచిన్న గులాబిరంగు మేఘాలు తేలుతూ ఉంటాయి. ఆ మేఘాల ప్రతిబింబం సరస్సులో చూస్తుంటే ఏదో గులాబితోటలాగు కనుపిస్తుంది.

# "శాకుంతల"

వజ్జ శ్రీ మన్నారాయణమూర్తిగారు
ఆరవెల్లి, కన్నరాజ గోపాలాచార్యులుగారు

ఆకణ్వాశ్రమసీమలోఁ బెరిగి, స్వేచ్ఛాధర్మ హృత్కంజవై
నీ కల్యాణము నీవచేసికొని సందీపింపఁగాఁ జేయవే
యాకణ్వాదిమహర్షి లోకహృదయాక్రాంతమున్ భాగత
శ్రీ కంజాక్షుల మానసంబులును, దల్లీ! భాగ్యవల్లీ! భువిన్ ॥

కొడుకున్ గాంచితివీవు నిక్కమగునీ కోర్కెల్ భువిన్ నిల్పఁగా
నడుగుల్ వేసితివీవు దండ్రియనుపన్ అత్తింటికావేళనే
పుడమిన్ గీరితినిల్ప నాకసము, సంబోధించెనచ్చోట, నీ
నడతన్ సభ్యులు మెచ్చుచున్, హృదుల నెన్నన్ నాఁడు శాకుంతలా! ॥

ఆనాఁడే భవదీయ హృద్బలము, దుష్యంతుండుఁ వీక్షించె, నీ
దా నామమ్మును మెచ్చి, హృత్ఫలకమందానాఁడె తాఁజెక్కఁగా
నీ, నిన్నెప్పుడు నాత్మలో మఱచియున్నె? ధర్మచింతారతుం
డో నారీమణి! స్వప్నమందయిన నోహో! భర్తృసేవారతీ! ॥

పుట్టితి బ్రహ్మర్షికిఁ జే, పట్టితి దుష్యంతుఁ బ్రబలబాహుబలున్, నీ
కట్టెదుట నసత్యమ్ములఁ, గట్టా యెవరైన, బల్కఁగానోడరె? సీ! ॥

దిశలువెలుంగు కీర్తిఁగొని, తేజమునొందితి వార్షిపుత్రి! త్వా
దృశు లెవరుందు రీభువిని, దివ్యశకుంతములెల్లఁ బెంచె నిన్,
శిశువుగ నున్నయప్పుడె, వశీకృతభూతివి కావె? నిత్యమున్
శశి కమృతంబుభాతిగను, శశ్వదుదారయశోవిలాసినీ! ॥

ఇంతులు నీ మహోన్నతిని, నెందునఁ బొందఁగలారు, పొందినన్
వింతయఁటమ్మ, నీసుగుణ విశ్రుతలై, వెలుగొందుచుండుటల్
కాంతు లవజ్ఞఁజేసిననుఁ గాంతలుఁ గోపమునొంది యెంతయున్
బంతములాడుచుండెదరు, భామిని, నీవలెగాక, ధీరవై ॥

నిండుసభలోన నినుఁజూచి నీచముగను; బల్కుదుష్యంతుఁ పల్కుల భావమువిని,
దుఃఖమునసీవు నశ్రులఁ దొఱఁగఁజేయ; నాకసముఁబల్కదే? నీదురాకశుభము ॥

శారదచంద్ర చంద్రికల సన్నిభమైన, త్వదీయకీర్తి యీ
ధారుణి నెల్లదిక్కుల నుదారతవెల్గె, భవద్గుణమ్ములో
సారసనేత్ర! కామినుల సాటియిఁకెవ్వరు నీకు లేరు, నీ
చారిత లెన్నరాదె? భువి, శాశ్వతకీర్తి విశాసినీమణీ! ॥

చూచినతోడనే వరుఁడు, సుందరుడంచు వరింపలేదు, నీ
చూచిన చూపులావరుని, శూరతధీరతఁ గాంచెఁగాన, నీ
పాచికచూపులావిభుని, పట్టుచుఁగెల్చెను, సుందరాంగి యా
రాచసుతుండు నిన్వలచె, రాజిలు నీమతిగాంచి మానినీ! ॥

నీవు స్వతంత్రవై మగనినెన్నితి, వింతభయమ్ములేక, నీ
భావుక మెంచు తండ్రిమది, బాధయొకించుకఁ బొందడంచు, నీ
కేవిధిఁదోఁచెనో యెఱుఁగ? మెట్టిసుకృత్యము లాచరించితో
యోవనజాక్షి! యెట్టివర మొందితివో, పరమేశుసన్నిధిన్ ॥

నీవొకసారి రాజుఁగని, నిక్కపుఁబ్రేమను, మన్మథాజిలోఁ
బావనబుద్ధి నుండినను, భామిని నీసుకృతంబు పండుటన్
జేవఁగలట్టి బాలకుడుజే సేభవద్ధృదయంబునందు నీ
భావఁమదెట్టిపట్టుఁదల బట్టెనొ, శీలితకామినీమణీ! ॥

నీచర్యల్ గని తండ్రి కోపపడఁడో, నీరేజపత్రాక్షి! నీ
యాచారమ్మున కార్యులెల్లఱును, నాహా! యంచుఁ దార్మెచ్చి, నా
రో చంద్రాస్య! త్వదీయగర్భమున, నోహో బాలచంద్రుండు నా
గాఁచత్వార ఘణాబ్ధిపుట్టె, భరతక్ష్మాపాలుడో కోమలీ! ॥

నీయాశీర్వచనమ్మమోఘముకదా! నీపుత్రుఁడే వేళలో
నాయారణ్యమునందు, సింహాసరభ వ్యాఘ్రాది జంత్వాళితో
నే యాటాడుచు, జంతుజాలముల, నెంతే గట్టుచుం గొట్టుఁదాఁ
బ్రాయమ్మున్నది రాకముందె నహహా! బ్రహ్మర్షిపుత్రీమణీ! ॥

నీసుతుఁడాటలాఁడగను, నెమ్మది సంతసమొంది, కణ్వుఁడా
భాసిలుమోముతో హృదయభావముఁ దెల్పెకదా తలోదరీ!

యోసుత! పొమ్ము, నీమగనియొద్దిక ప్రేమగనంగయున్న నీ
వీసును బొందకేగవె? మహీపతిచెంతకు భక్తితోడుతన్ ॥

అయ్యశరీరవాణినిను, నాదృతిపల్కిన పల్కువించుఁడాఁ
జెయ్యెనసెప్పె మీవలప్రసంగతినంతయు, మంత్రులెల్లతా
దియ్యమయుండి మానసముఁ దియ్యము లేనటులుండెనంచుఁదా
రెయ్యెడమాటలాడుచును, నేగిరియిండ్లకు సంతసంబునన్ ॥

సుతునితోఁడనిన్ను సుదతి! యంతఃపురిఁజేర్చె రాజువిమల, చిత్తమునన
యతఁడు రాజుగాఁగ, క్షితి, భారతమ్మయ్యొ తల్లి! నీదుకోర్కె, తనివిఁదీర !॥






## పేలాల వడియాలు

ఒక శేరు వరిపేలాలను ఏరి ఒక కళాయిలో పోసి, పుల్లటి గడ్డపెరుగు ఒక సేరుపోసి కొంచెము ఉప్పు ½ పలము జీలకర్ర, రెండు పలముల పచ్చిమిరపకాయలు కుంకుడు కాయంత యింగువ బాగా నూరి కలపవలెను. అరగంట సేపు నానబెట్టి కొత్తిమిరి కలిపి వడియములు పెట్టవలెను. బాగ ఎండిన తరువాత నేతిలో వేయించిన యెడల ఒక్కొక్క వడియము రెండింతలు పొంగి చాల రుచిగా వుండును. ఈ వడియాలు ఆరోగ్యకరమైనవి - బాలింతలకు కూడ ఉపయోగింతురు.

పై విధముగానే అటుకుల వడియములను కూడ పెట్టుదురు. అటుకులు నానిన కొద్ది ఉబ్బును కనుక ఒక శేరు అటుకులకు మూడు శేర్లకు తక్కువలేకుండా పులిసిన గడ్డపెరుగు కలుపవలెను.

వంగోలు కనకవల్లి

## గుల్ పాపడి

ఐదుతులములు నేతిలో 24 తులముల గోధుమపిండిని వేయించి తీసుకొనవలయును. ఆరుతులముల పాలు బాణలిలో పోసి, 24 తులముల చక్కెర దానిలో వేసి, కొద్ది పాకమైన వెనుక, 6 తులముల కొబ్బెర కోరును, పై వేయించి పెట్టుకున్న పిండిని పాకములో వేసి, పొందుకొనేటట్లు చేసి క్రిందకు దించుకొని, అరతులం యాలుకల పొడి చల్లి ఉండలు కట్టవలయును.

వాశిరెడ్డి సూశీలాదేవి

## వంకాయ ఊరగాయి చేయువిధానము

ఒక వీశెడు వంకాయలు, తెచ్చి శుభ్రముగా గుడ్డతో తుడిచి కూరముక్కలు వలెనే తరిగి వుంచుకోవలెను. పావు వీశె చింతపండు ఈనెలు గింజలు తీసినది, పావుశేరు వుప్పు. టీస్పూన్ పసుపు, ఈ వంకాయి ముక్కలు అన్నీ కలిపి కంగామంగా రోటిలో వేసి దంచేది. మూడు రోజులు వూరనిచ్చి పావుశేరు కారపుగుండా, అరసోలడు వేయించిన మెంతిగుండ అందులో కలుపవలెను. తరువాత 4 తులాల మినపప్పు 4 తులాల మిరపకాయలు, 4 తులాల ఆవాలు, పావుతులం యింగువ, కరివేపాకు, నువ్వులనూనెలో యివన్నీ దోరగా వేయించి పచ్చడిలో కలుపవలెను. చాలా రుచిగాను నోటికి హితవుగానుండును. మామిడికాయలు దొరకని రోజులలో ఈ పచ్చడి చాలా వుపయోగముగా నుండును. గృహలక్ష్ములందరూ ఈ పచ్చడి ఒకసారి చేసి చూడవలెను.

బాపరాతు నూకావతీదేవి.

—— (o) ——

# పార్వతికి లేఖలు



సోదరి పార్వతీ!

ఆశీర్వాదాలు. మొన్న నీవు మనవూరికి వచ్చినపుడు నీతో ముఖ్యవిషయాలు యెన్నో మాట్లాడుదామనుకొన్నాను. కాని మీ బావగారు క్యాంపునకు ప్రయాణసన్నాహంలో వున్నందున వారి సామానులు సర్దటంతో నా కాలం గడచిపోయింది. సాయంత్రం తమ్ముణ్ణిపంపి విచారించుకుంటే, ఇంకేం అప్పుడే నీవు వూరికి పోయావని తెలిసింది. సరే - నాకు చాలా విచారం గల్గింది. యెందుకంటే-దగ్గరకు వచ్చినపుడు మాట్లాడుకోడానికి తీరికవుండదు. దూరంగా వున్నప్పుడు వుత్తరాల ద్వారా మాట్లాడుకొందామా అంటే నీకు చదువురాదు. మరి - మన చిన్ననాటి స్నేహం యీ విధంగా ముగిసిపోవాల్సిందేనా? వూహూం అట్లాపిల్లేదు - దీనికి నేనొక వుపాయాన్ని ఆలోచించాను. అదేమిటంటే నీకు చదువు నేర్పటమే - యీ సంగతి ఇంతకుముందే చాలాకాలం క్రిందటనే నీకు చెప్పాను. అప్పుడు నీవేమిచెప్పావో నాకుబాగా జ్ఞాపకంవుంది. "యిన్ని అక్షరాలు యెప్పుడు నేర్చుకోగలను?" అనిప్రశ్నించావు. అన్నీ నేర్చుకొని తీరవలసిందేనని నేను జవాబుగూడా చెప్పాను - దాంతో నీవుగాభరాపడి 'అమ్మబాబో!' నాతో కాదక్కయ్యా! అని చల్లగా జారుకొన్నావు. యింటిపనులలో మునిగి తీరిక తక్కువగాయున్న నీకు కొద్దికాలంలో - సులభంగా చదువు నేర్పేవుపాయం నాకానాడు తోచక చాలా తికమక పడ్డాను. సరే - యీ మధ్య మీ బావగారికి క్యాంపుల్లో వయోజన విద్యాప్రచారం సాగించవలసినదిగా ప్రభుత్వం నుంచి వుత్తరువులు వచ్చాయి - వారు అందుకు తగిన ప్రయత్నాలన్నీ చేసుకుంటూన్నారు-అందలి తేలిక సూత్రాలు నాకూ కొన్ని తెలియచేశారు - యిదిగో చెల్లీ! నిజంగా చెప్తూన్నా. నాలుగు మాసాల్లోనే మనం వుత్తరాలద్వారా మాట్లాడుకోడానికి తగినంత విద్య నేర్చుకోవచ్చు - నామాటలు నీకాశ్చర్యంగా వున్నాయా? వుండొచ్చు - యెందుకంటే "మనపిల్లలు బడిలో నాలుగేండ్లు చదివినా వుత్తరాలు వ్రాసే సామర్థ్యం గలుగటం లేదే; 'ఒ' అంటే 'న' రాని నాకు నాలుగు మాసాలకే చదువెలా వస్తుందనే కదా నీ ఆశ్చర్యం? అంతేనా? సరే విను మరి? తెలుగుభాషలో చాలా అక్షరాలు వున్నాయి - అందులో యెక్కువగా వాడబడే అక్షరాలు యిరవైనాలుగే - యివి గూడా వ్రాయటానికి చదువటానికి చాలా తేలికగా వుండేవే - యీ అక్షరాలు, గుణింతం నేర్చుకున్నావంటే షుమారైన పాఠాలు రచనలు, విషయాలు చదువవొచ్చు - వ్రాయవచ్చు - యెంత జ్ఞాపకశక్తి తక్కువగల వారైనగాని ఇంతవరకు ఒకనెలకు నేర్చుకోవచ్చు. అప్పుడు దాదాపు రెండువందల వాడుక మాటలు వ్రాయటానికి - చదవటానికి వీలవుతుంది - యేపనైనా ఆరంభించకముందు కష్టంగా తోస్తుంది. ఆరంభించిన

తర్వాత తేలికగానే పని సాగిపోతుంది - దిగులు పడవద్దు. నీవు తేలికగానే నేర్చుకుంటావు. నాలుగైదు రోజుల్లో మీ బావగారు క్యాంపునుంచి వస్తారు - రాగానే తగిన బొమ్మలతో తేలిక పద్ధతులపై సులభముగా గుర్తుపట్టి అక్షరాలు నేర్చుకొనే పద్ధతులు వ్రాసిపంపుతాను. మన కృష్ణుని సహాయంతో సులభంగా నేర్చుకొంటావు సరేనా, అందరి క్షేమాలు వ్రాయించు. మేమంతా కులాసాగానే వున్నాము.

నీ ఆత్మీయ సోదరి,
కె. లక్ష్మీనారాయణమ్మ

# నవ్వుతాలు



హడావుడిగా తెచ్చిచూపిన ప్రోగ్రెస్ రిపోర్టును చూచి తనకుమారుడు పరీక్ష ప్యాసయినందుకు తల్లిదండ్రులు సంతోషపడుతున్నారు. ఇంతలో ప్రక్కయింటి గోపి వచ్చి,

"ఏమండీ! మీ రాము తన ప్రోగ్రెస్ రిపోర్టును నా చేతికిచ్చి నాదానిని తనుతీసుకొని వచ్చాడు" అని తనచేతిలోని ప్రోగ్రెస్ రిపోర్టును అందిచ్చాడు.

రాము తెల్లమొగంపెట్టాడు. ప్రోగ్రెస్ రిపోర్టు చూడరుగదా దేనిలోను 10 మార్కులకు ఎక్కువ వచ్చిందలేదు రాముకు.

  

రమణ: ఆలోచించి ఆలోచించి మెదడు చెడిపోతున్నదిరా.

రామనాథం : పరీక్షలు అయిపోయినవి కదరా - మరెందుకీ దీర్ఘాలోచనలు?

రమణ : ఇక క్రొత్తవి ఏమేమి ఆటలాడుదామా అని.

  

ఒక ఉపాధ్యాయుడు పాఠంచెప్పి "పళ్లనుగురించి పాఠం పూర్తిఅయింది. ఏదీ - గోపీ! మనుష్యునికి కడపట మొలిచే పళ్లేవి" అని అడిగాడు.

"అబద్ధమాడే పళ్లండీ"

  

దొంగిలించి పారిపోతున్నదొంగ పట్టుబడ్డాడు. ఇంటియజమాని "దొంగవెధవా! దొరికావులే యింకెక్కడికి వెళతావు. ఆసంచిలోని సామానుతీసి అక్కడపెట్టు" అని గద్దించి అరిచాడు.

అందుకు దొంగ "సంచిలోని సామానంతా ఎందుకుతీసి పెడతాను? అందులో సగం ప్రక్కయింటి వాళ్లది" అన్నాడు.

'లక్ష్మి'



# ఆదర్శయువతి; పద్మ

శ్రీమతి కుమారి బి. రాజేశ్వరి

పద్మ ఏమిటో ఆలోచిస్తూ కూచుంది కుర్చీలో. చిన్న విజిల్ వేసుకుంటూ వచ్చాడు మోహన్. "ఓహో మోహన్ ఎప్పుడేంటి రావడం రా కూర్చో" అంటూ ఆహ్వానించింది పద్మ. "నిన్న సాయంత్రమే వచ్చాను; అంతా కులాసాయేనా. ఏమిటి విశేషాలు" అంటూ సంభాషణ మొదలు పెట్టాడు మోహన్. "ఈవూరి విశేషాలకేమిలే. ఏమైనా వింతలూ విశేషాలు నువ్వే చెప్పాలి; పట్నం నుంచి వచ్చేవాడివేను." "నిజమే పద్మా పట్నం జీవితం ఎంత ఆనందంగా వుంటుందనుకున్నావ్! కొత్త కొత్త సినిమాలు, అందమైన పార్కులు; ఫ్రెండ్స్‌తో కలిసి బీచికి పోతోంటే నిజంగా స్వర్గలోకంలో విహరిస్తున్నట్లే వుంటుంది. అందులో మాకేమిటి! మమ్మల్నే వాళ్లందరు. సర్వస్వతంత్రులం." అంటూ తన గడచిన పట్నం జీవితం నెమరు వేసుకుంటున్నాడు మోహన్. "అవునవును దార్లో ఎక్కడైనా అమ్మాయిలు కనిపిస్తే హేళన చెయ్యటం, ఫోజులివ్వటం ఓ ఆనందమేకదూ" "ఆ. ఏమిటో మా కాలేజీ స్టూడెంట్స్‌కి అదో హాబీ అయిపోయింది." ఒకరి ఆశయాల్తో ఒకరు ఏకీభవించలేక పోయేవారు. ఇద్దరూ ఎప్పుడూ కల్సుకున్నా ఏదో వాదన వేసుక్కూచునేవారు.

మోహన్ ఒక సామాన్య కుటుంబంలో జన్మించాడు. పట్నంలో బి. ఏ. పూర్తిచేసుకుని వచ్చాడు. చూడ్డానికి ఆకర్షణీయంగా బాగానే వుంటాడు.

సావిత్రమ్మ, రమణయ్య పంతులుగార్లకి లేక లేక కలిగిన ఏకైక సంతానమే పద్మ. కొద్దో గొప్పో ఆస్తికలవాళ్లే. ఇక పద్మ సౌఖ్యానికి ఏలోటు లేదని వేరే చెప్పాలా. ఎఫ్. ఏ. తో చదువు చాలించింది. పద్మా మోహన్ లిరువురూ స్కూల్ ఫైనల్ వరకూ కలిసి చదువుకున్నారు. ఆ స్నేహాన్ని పురస్కరించుకుని శెలవుల్లో స్వగ్రామం వచ్చినప్పుడల్లా పద్మ గారింటికి వెళ్ళడం పరిపాటే మోహన్‌కి. చిన్నప్పటినుండి స్నేహంగా వుండటం మూలాన పద్మా మోహన్‌లకి పెళ్ళిచేస్తే బాగుంటుందనుకొనే వారు పెద్దవాళ్ళు.

పంతులుగారు భోజనంచేసి పేపరు తిరగేస్తూ కూచున్నారు. ఇంట్లో పని పూర్తిచేసుకుని వచ్చింది సావిత్రమ్మ. "ఏమండీ ఏంచేశారు అమ్మాయి సమంధంమాట? అబ్బాయికూడా చదువు పూర్తి చేసుకుని వచ్చాడుమరి. 'శుభస్యశీఘ్రం' అని ఏదో అశుభకార్యం కాస్తా పెందలాడేచేస్తే బాగుంటుంది." "పొద్దున్నే శాస్త్రిలుగారు చెప్పారు ఎక్కువ కట్నం పుచ్చుకునే వుద్దేశంలో వున్నారు వాళ్లు అని" "కట్నానికేంలెండి. మనకి మాత్రం ఏమంత పదిమంది వున్నారని. ఎప్పటికైనా ఆస్తంతా అమ్మాయికేకా. ఏదో కొంత పెళ్ళిలోనే కట్నం రూపకంగా ఇస్తే గొప్పగానూ వుంటుంది. పిల్లాడు చదువుకున్నాడు. బంగారంలా వుంటాడు. అయినా అమ్మాయి ఉద్దేశంకూడా కనుక్కుందాం ఉండండి. ఏం అమ్మా! ఈ సమంధం నీకు ఇష్టమేనా." "కట్నం విషయంలోనైతే నా అసమ్మతిని తెలుపవలసొస్తుందమ్మా." "అదేమిటమ్మా అలా అంటున్నావ్. ఇప్పుడు ఎక్కడైనా అప్పుతేవాలని భయమా. ఏవస్తువులైనా అమ్మేయాలని భయమా. ఏదో సబంధం మంచిదవుతే కట్నం ఎంతైనా ఇవ్వడానికి మనకి ఏంకష్టంలేదుకదమ్మా" "అదికాదు నాన్నా. మనకింత దబ్బువుంది మనం కట్నం ఇవ్వగలం. ఇదే దబ్బులేని పేదవాళ్ళవుతే ఏంచెయ్యగలరు? పోనీ దబ్బున్నవాళ్ళు కట్నంఇచ్చి

కన్యనిస్తే లేనివాళ్ళు కట్నంలేకుండానే పిల్లనిస్తామంటే వూరుకుంటున్నారా? డబ్బున్నవాళ్ళు ఇచ్చారని లేనివాళ్ళ నిమ్మనమంటే ఎలా ఇవ్వగలరు నాన్నా? ఈ కట్న పిశాచి యినుపపాదాలక్రింద ఎంతమంది అమాయిక కన్యలు బలిఅవుతున్నారో ఎన్ని కుటుంబాలు నాశనమౌతున్నవో చూడండి! కట్నం విషయంలోనైతే నాకేమాత్రం ఇష్టంలేదు. క్షమించండి!" అంటూ చర్రున అక్కడినుండి వెళ్ళిపోయింది. "సరే ఆలోచిద్దాం" అంటూ వేడి నిట్టూర్పు విడిచారు ఆ దంపతులు.

ఆ మరునాడు "ఏమన్నారండీ తండ్రీ, కొడుకు వచ్చారు కాబోలు." "ఏమంటారు? 10 వేలకి తక్కువ కట్నం లేకుండా పెళ్ళిమాట తలపెట్టరట వారు. అసలు విషయమేమిటంటే అబ్బాయి చదువు సందర్భంలో కొంచెం అప్పుచేశాడట ఆయన. అదిగాక ఎనిమిది ఏళ్ళది ఒక అమ్మాయివుందికదూ ఇంకా. దాని పెండ్లికి కట్నం అని ఇప్పటినుండీ జాగ్రతపడుతున్నాడని ఆ భైరవశాస్త్రిలుగారు చెప్పారు." "ఇంతకీ అబ్బాయి ఏమన్నాడు." "తండ్రి యిష్టమే తన యిష్టము"ని చెప్పాడు. "అమ్మాయిచూస్తే ఇలా అంటుంది. ఈ సమంధం పూర్తిగా వదులుకోవలసిందేమనం" "పోనీలెండి ఏదో చిన్నప్పటినుండీ స్నేహంగా వున్నవాళ్ళం కదా అని కానీ లేకపోతే అమ్మాయి కెక్కడా దొరకపోదులెండి మంచి సమంధం. దాని ఇష్టప్రకారమే చేద్దాం." పక్క గదిలోంచీ సంభాషణంతా వింది పద్మ. ఏవేవో ఆలోచనల్తో ఆ లేత హృదయం కదిలిపోతోంది. "పవిత్ర భారత దేశానికి భావిపౌరులు కాబోయే నేటి చదువుకున్న యువకులే కట్నం అనీ, తమ తోటిదే లోకం అనీ ఇలా స్వార్థంతో అజ్ఞానంగా ప్రవర్తిస్తుంటే దేశం ఏంబాగుపడ్తుంది? 'తండ్రి ఇష్టమే తన ఇష్టమట' ఏం, తన ఇష్టం వచ్చినట్టు డబ్బు ఖర్చుపెట్టి బాగా జల్సాగా తిరిగినప్పుడు తండ్రి ఇష్టాయిష్టములతో పనిలేక పోయిందేం. అప్పుడైతే సర్వస్వతంత్రుడైయాడా-ఇప్పుడు కాకపోయేడా. కష్టపడి అప్పుచేసి చదువు చెప్పించినందుకు తను కష్టపడి ఉద్యోగంచేసి అప్పుతీర్చి తండ్రిని సుఖపెట్టాలికానీ మధ్యన పిల్లనిచ్చే మామగారా ఆ అప్పుతీర్చేది? ఎంత న్యాయంగావుంది! చిన్నప్పటినుండి ముద్దుగా పెంచి పెద్దచేసి అల్లుడిచేతిలో పెట్టటంచాలదు. ఉన్న భూమి పుట్ర అమ్ముకునో, అప్పుచేసో అమ్మాయిని చేతిలోపెట్టి వీళ్ళ మనశ్శాంతి లేకుండా కృశించిపోవలసిందేనా? అందుకనే ఆడపిల్ల అంటే అంత హీనంగా చూస్తారు. ఆడపిల్ల పుట్టిందంటే మొహం ముడుచుక్కూచుంటారు. ఛీ! ఛీ! ప్రతి స్త్రీ కూడా ఒకరిపై ఆధారపడకుండా స్వతంత్రంగా జీవించే శక్తికలిగి వుండాలి. ఆనాడే కట్నపిశాచిని అరికట్టకలిగే మార్గం లభిస్తుంది." ఇంకా ఏవేవో భావాలు ఆమె మనోవీధిలో రైలుబండిలా పరిగెడ్తున్నాయి.

ఆవేళ రమణయ్య పంతులు గారితోకూడ ఓ అబ్బాయి వచ్చాడు. పాతికేళ్ళలోపు వయస్కుడు. ఆ నొక్కు నొక్కుల జుత్తు, చక్కని శరీరచ్ఛాయ చూడ్డానికి ఎంతో ఆకర్షణీయంగా వున్నాడు. కానీ ఎందుకో అతను చాలా విచారంగావున్నాడు. పంతులుగారు లోపల కొస్తూనే "ఏమేవ్ ఇదుగో చూడు ఈ అబ్బాయిని లోనికి తీసుకవెళ్ళి భోజనం పెట్టు. పాపం రెండురోజులనుండి భోంచెయ్యలేదుట. ఊ-త్వరగా" "అయ్యోపాపం! రా నాయనా భోంచేద్దువుగాని" అని లోనికి తీసుకెళ్ళింది. "ఎవరు నాన్నా ఆ అబ్బాయి" అంటూ వచ్చింది పద్మ. "ఎవరోనమ్మా బ్రాహ్మలబ్బాయిట. రెండు రోజులనుండి భోజనంలేదుట. ఏమైనా డబ్బులుంటే ఇమ్మన్నాడు. ఈ రోజుల్లో ఏ హోటల్లో సౌఖ్యంగా తిండి దొరుకుతోందమ్మా? అంచేత మన ఇంటికి తీసుకునివచ్చాను. అబ్బాయి చూస్తే సాంప్రదాయంగల కుటుంబంలోని వాడిలాగే వున్నాడు."

"ఏం నాయనా భోంచేశావా. రా కాసేపు కూచో. ఏవూరునుండి వచ్చావ్? నీ తలి తండ్రు

తెవరు చెప్పు నాయినా." "ఆదరించి నా ప్రాణం కాపాడిన దాతలు మీరు-ఇంతగా అడగాలా నా జీవితచరిత్ర చెప్తా వినండి" సావిత్రమ్మగారుకూడా వచ్చి కూచుండి. మొదలు పెట్టాడు.

"నా పేరు వేణుగోపాలరావు. అందరూ వేణు అని పిలుస్తారు నేను ఇంటర్ రెండో ఏడాది చదువుతూ మానేశాను. తల్లి, తండ్రి, ఒక చెల్లి నేను ఇది మా కుటుంబం. మేం ధనవంతులం కాం. ఏదో పెద్దలు సంపాదించి పెట్టిపోయిన ఓ చిన్న పెంకుటిల్లు మాత్రం వుండేది. మా నాన్న గుమస్తా పని చేసేవారు. ఒకరిచేత మాటపడకుండా ఎంతో గౌరవంగా బ్రతికిన కుటుంబం మాది. అప్పటి మా జీవితం ఏ ఒడిదుడుకులు లేకుండా ఎంతో నిశ్చలంగా గడిచిపోయింది. నేను స్కూల్ ఫైనల్ పాసయ్యా. స్కాలర్‌షిప్ వుండటం మూలాన కాలేజీలో చేరా. చెల్లాయికి యుక్తవయస్సు వచ్చింది. కట్నపిశాచి ప్రళయతాండవం చేస్తున్న ఈ రోజుల్లో సామాన్య కుటుంబాల్లోని కన్యలకు వివాహం చెయ్యడం మాటలా? మా నాన్న రెండేళ్ళు కాళ్ళు అరిగిపోయేటట్లు తిరిగారు. లాభంలేకపోయింది. ఎక్కడచూసినా కట్నదేవత ప్రత్యక్షం. సంఘం మమ్మల్ని నిలువనియ్యలేదు. లేనిపోని మాటలు ఆడిపోసుకుంది. చివరకు నాన్న భరించలేక విసికిపోయి ఉన్నయిల్లు కాస్త అమ్మేసి తక్కువ కట్నంతో ఎలాగో చెల్లాయి పెళ్ళి చేశారు. తరువాత తెలిసింది - అతను కోపిష్ఠి, జూదరి అని. ఏంచేస్తాం-చేతులు కాలాక ... పెండ్లి సందర్భంలో కొంత అప్పుకూడా తీయాల్సొచ్చింది. ఇప్పుడు మేం ఒక పూరి గుడిసెలోకి బసమార్చాం. అప్పు తీరేవిధం కనిపించలేదు. పోనీ నేనే ఏదైనా ఉద్యోగం చేద్దామని ప్రయత్నించా. ఈ నిరుద్యోగపు రోజుల్లో నా ప్రయత్నం ఫలించలేదు. ఈ బెంగతోనే నాన్న మంచంపట్టి ఆఖరికి జీవితం కూడా చాలించారు. ఇక అమ్మ అసలే ధైర్యంలేనిది. ఈ స్వార్థపూరిత లోకంలో నన్నొక్కడినీ విడిచేసి నాన్నగార్ని చేరుకుంది. పోనీ ఏదైనా కూలీపని చేద్దామా అనుకున్నా. 'పువ్వులమ్మిన ఊళ్ళో కట్టెలమ్మలేం' అన్నట్టు ఆత్మాభిమానం ఒకటి చావలేదుగా-నన్నా పని చేయనీయలేదు. ఇలా ఈ వూరు వచ్చేశా. రెండు రోజులనుండి ఏదైనా నౌకరీ దొరుకుతుందేమో అని ప్రయత్నిస్తున్నా. నాకైతే చదువుకోవాలనేవుంది. కానీ నా కోరిక నెరవేరలేదు ఇదీ నాజీవితచరిత్ర ఇక నేను శెలవ్ తీసుకుంటా." ఆదరించి నా ప్రాణం కాపాడిన దాతలు. మీ అందరికీ నా కృతజ్ఞతా పూర్వక వందనములు" అంటూ లేచాడు.

"ఇప్పు డెక్కడికి వెళతావ్ నాయనా. ఏదో ఆ ఇంటరీ కాస్త పూర్తిచేస్తే నీ దారిన నువ్వు బతకొచ్చు. దానికయ్యే ఖర్చు నేనిస్తా. నువ్విక్కడే వుండి చదువుకుంటావా" "ఆ! నాకంత అదృష్టమా-తప్పకుండా అలాగే చదువుకుంటా" అప్పట్నుంచీ వేణు అక్కడేవుండి చదువుకుంటున్నాడు. అతని సత్ప్రవర్తన, వినయవిధేయతలూ చూసినవారు ఎంతో ముచ్చటపడేవారు. ఎప్పుడూ చదువుకుంటూనో వ్రాసుకుంటూనో కూచునేవాడు. పరీక్షలయ్యాయి. ఆ వేళ మధ్యాహ్నం వేణు భోజనానికి వెళ్ళినప్పుడు అతని గదిలో టేబిల్ మీదనున్న కాగితాలు తీసి చూసింది పద్మ. ఏవో కథలూ, గేయాలూను. సాయంత్రం తోటలో కూచుని మెల్లిగా పాడుకుంటున్నాడు వేణు. "ఈ గీతం నువ్వు వ్రాసిందేకదూ వేణూ" అంటూ వచ్చింది పద్మ. "అవును పద్మా, నీకెలా తెలిసిందీ." "ఎప్పుడూ ఏదో వ్రాస్తూనో చదువుతూనో కూచునేవాడివిమరి. ఏమిటి వ్రాస్తున్నావో చూడాలనిపించింది. నువ్వు భోజనానికి వెళ్ళినప్పుడు నీ గదిలోకి వెళ్ళి చూశాను; క్షమించు" "ఎంతమాటన్నావ్ పద్మా నిజంగా మీసహాయం లేకపోతే నేనేమయ్యేవాడినో ఇంకా ఎన్నికష్టములకి లోనుకావలసినవాడినో," "దానికేమిటివేణూ తోటి మానవులమైన మనం ఒకరియందొకరం ఆ పాటి సహాయం, సానుభూతితో వుండకపోతే ఎలా? అవును కానీ వరకట్నాల గురించి అంత ఘాటుగా

విమర్శించావ్ అంత హీనంగా చూస్తూ వ్యాసం వ్రాశావ్. మరి కట్నం లేకుండానే వివాహం చేసుకుంటావా నువ్వు? అయినా ఆదర్శానికి, ఆచరణకి చాలా దూరం వుందికదూ. బి. ఏ. కి 10 వేలకి తక్కువ లేకుండా కట్నమైతే ఎఫ్. ఏ. చదివావ్ 5 వేలకి తక్కువరాదులే కట్నం. కోరితే ఇంకా ఎక్కువే వస్తుంది. అయినా మీయువకులంతా అంతే. చెప్పేదొక్కటి, చేసేదొకటి. మహా సంస్కర్తలలా వుపన్యాసాలు దంచేయడమే కానీ తీరా సమయం వచ్చేసరికి వారి ఆశయాల్ని ఆచరణలో పెట్టలేరు" కోపంతో మాట్లాడేస్తుంది పద్మ.

"కేవలం తప్పంతా పురుషులదే అనటం పొరపాటు పద్మా. అయినా నా విషయం చెప్తున్నా. భవిష్యత్ లో నా జీవితం సుఖంగా సాగిపోతుందని నేనెప్పుడూ అనుకోవటంలేదు. అలాటి నేను వివాహ విషయమే తలుచుకోను. ఒకవేళ అలా సంభవిస్తే నేనొక ఆదర్శ జీవిననీ, నా ఆశయాల్ని ఒక కలంవరకే కాకుండా ఆచరణలో పెట్టేవాడినని లోకం నన్ను గుర్తించగలదు. ఈ వరకట్న మహమ్మారివలన మాలాటి సామాన్య సంసారాలు ఎలా చితికిపోతున్నాయో అనుభవించిన వాడిని నాకు తెలుసు. నా సోదర మానవులు ఇలాటి బాధలకి గురికావడం నేను సహించలేను. ఎప్పటికైనా సంఘంలో వుండే దురన్యాయాలనీ, కట్నపిశాచిని అంత మొందించాలనే నా నిశ్చయం, అందుకే నేను ఇంకా జీవించివున్నా లేకపోతే ఏనాడో నా తల్లిదండ్రుల్ని కలుసుకునేవాడిని" ఆవేశంతో మాట్లాడేస్తున్నాడు. (అదేదో కాలేజీ ప్లాటుఫారం అనుకొన్నాడు కాబోలు.)

'వేణు హృదయం ఎంత లోతైనదీ. ఏకష్టాలు లేనివాడిలా ఎంతో అమాయకంగా కనిపిస్తాడు. మెత్తని హృదయం, విశాల భావాలు కలవాడు. ఏజాతి అవుతేనేం, నేనే ఇతన్ని ఎందుకు వివాహం చేసుకోకూడదూ.' అనుకొంటుంటే పక్కగదిలోంచి ఏవో మాటలు వినిపించాయి. తన ఆలోచనల్ని కట్టిపెట్టి శ్రద్ధగా వింటూంది పద్మ.

"ఏమేవ్ మనింట్లో వుంటూన్న వేణు ఎవరబ్బాయనుకున్నావ్. మన వెంకన్న పంతులుగారబ్బాయేనే. మంచి నడత, సుబుద్ధి తండ్రికే తీసిపోడు. అందుకే పెద్దవాళ్ళు మంచి వంశం, మంచి సాంప్రదాయం అంటారు. చూశావా మనం అడుగుతే తండ్రిపేరు చెప్పలేదు. చిన్నతనం అని." "మీకెలా తెలిసిందండీ వెంకన్నగారబ్బాయి అని" "ఇంకా అడుగుతున్నావా వాళ్ళవూరతను ఎవరో వచ్చాడు. వేణు అనే అబ్బాయి మీఇంట్లోవుండి చదువుకుంటున్నాడట నిజమేనా అని అడిగాడు. అవును ఎవరి అబ్బాయి అతను అని అడిగా. ఫలానా వెంకన్న పంతులుగారబ్బాయి. చాలా మంచివారండీ ఎంతో గౌరవమైన కుటుంబం వారిది. పాపం, విధి వాళ్ళనలా చేసింది అంటూ చెప్పాడు. చిన్నప్పుడు మేం ఇద్దరం ఎంతో స్నేహంగా వుండే వాళ్ళం. ఇలా పొట్టకోసంఅని విడిపోయాం. ఒకరిజాడ మరొకరికి తెలియకుండానే ఇన్నేళ్ళు గడిచిపోయాయి. మళ్ళా విధి మనల్నిలా కలిపింది." "ఆహా, అలా అయితే మన అమ్మాయిని ఆ అబ్బాయికెందుకు ఇచ్చి వివాహం చేయకూడదు? మంచి సాంప్రదాయం. పిల్లడు బాగుంటాడు. ఒక్కగానొక్క అమ్మాయి అయినందుకు అల్లుడు, కూతురు మన దగ్గరే వుంటారు" "చూదాం. అయినా అమ్మాయి అభిప్రాయం కనుక్కోవద్దూ" సంభాషణంతా వింది పద్మ. హృదయం పట్టలేనంత ఆనందంలో మునిగిపోయింది.

కాలం మహాప్రవాహంలా దొర్లిపోతోంది. కొన్ని ఏళ్ళు గడిచిపోయినై. ఇప్పుడు వేణు యమ్. బి. బి. యస్. డాక్టరు. ఇప్పుడు పద్మా వేణూలకి ఓ చిన్నపాపకూడాను. ఇక ముసిలిదంపతులకేం పనిలేదు. సంసారం బాధ్యత కూతురు అల్లుడికి అప్పచెప్పేసి రామాయణ భారతములు చదువుకుంటూ, చిన్ని మనుమరాలితో కేరింతాలుకొడ్తూ

నిశ్చింతగా జీవితశేషం గడుపుతున్నారు. కాక పోతే తమ ఆస్తి అంతా మనుమని పేర వ్రాసేస్తే ఇక ఏవిచారములేదు.

తండ్రి ఉద్దేశము గ్రహించింది పద్మ "నాన్నా నేనో విషయం చెప్తాను. మీరేమీ అనుకోరుకదా." "అదేమిటమ్మా చాలా కొత్తగ మాట్లాడుతున్నావ్ ఏమిటి చెప్పమ్మా." "ఏదో మీదయవలన జీవితం సుఖంగా సాగిపోయే మార్గం ఏర్పడింది. అలా సాగిపోతూందికూడా. ప్రస్తుతం మనదగ్గరున్న మూల ధనముతో మనపెద్దమేడలో ఓ శరణాలయం స్థాపించి ఎటూ వచ్చేరాబడి అందుకోసం వినియోగించి అనాధలకి నిస్సహాయులకి సేవచేయాల్నుంది. నాన్నా ఏమంటారు," "మీఇష్టమేనమ్మా ఈ సంసారం బాధ్యత అంతా మీకే వదిలిపెట్టాను."

తల్లి, తండ్రి పేరున ఓ శరణాలయం స్థాపించారు పద్మా, వేణులు. అనాధలయిన స్త్రీలనూ దిక్కులేని బాలబాలికలనూ చేర్పించి చదువుచెపుతూ ఏదో ఒక వృత్తితో జీవనోపాధి గడపగలిగే శిక్షణనిస్తూ, బీదలైన రోగులకు సహాయంచేస్తూ, తమ శక్తికొలదీ మానవసేవచేస్తూ ఆదర్శ దంపతులవలె జీవిస్తున్నారు పద్మా వేణులు.




శ్రీమతి వల్లభనేని రంగాదేవి

(గతసంచిక తరువాయి)

ఎలిస్:_మహారాణిగార్కి సలామ్. గాడ్ సేవ్ దిక్వీన్.

రాణి:-మేజర్ సాహబ్‌గారూ! విషయ మేమిటి? దారితప్పి వచ్చినట్టున్నారు? అంత పొరపడిరేమి?

ఎలిస్:_(గాభరాగా) ప్రస్తుత పరిస్థితి భయంకరంగావుంది. సిపాయిలంతా తిరుగుబాటు చేయాలనుకుంటున్నారు రాణీగారు! వాళ్లు మమ్ము బాధుతున్నారు. చెప్పేది వినిపించుకోవడంలేదు. ఫోర్టు మీద దండెత్తాలనుకుంటున్నారు. భయంతో మేము బయటకు రాలేకపోతున్నాం. పిల్లలు స్త్రీలు అందరు ఆకలితో వున్నారు. తినడానికేమి దొరకడంలేదు. దయతో సహాయంచెయ్యిరాణీ!

కిరణ్:-మేజర్ ఎలిస్; ఇప్పుడు సహాయం కొరకువచ్చిరి! ఆంగ్లేయ స్త్రీలు. పిల్లలూ ఆపదల్లోవున్నారా? పాపం ఆకలివల్ల ప్రాణాపాయ స్థితిలోకూడా వున్నారా? కాని స్త్రీలమగు మమ్మెదిరించి ఝాన్సీ సింహాసనాన్ని ఆక్రమించి, మమ్మూ, మాపిల్లలనూ, బజారు బిచ్చగాళ్లగా తయారుజేసినట్టి ఆ రోజు ఆ పవిత్రదినమును మీరు యెలా మరచిపోయ్యారు? ఆంగ్లేయులకే మపకారమొనర్చితిమి మేము? మా రాజ్యాన్నెందులకాక్రమించారు? మాయాభరణము లెందుకొలుచుకున్నారు? యెందుకు వేలమువేసిరి? యీ విషయమై మీరుగాని మీజాతిగాని ఒక్కనాడైనా దీర్ఘంగా ఆలోచించుకున్నారా? నేడేముఖంబెట్టుకునివచ్చి సహాయంజేయమని అర్థిస్తున్నారు? మా దగ్గరేముంచారు? పొండి అలాంటి దుర్మార్గులకు సహాయం మద్దతు లభించదు.

ఎలిస్:_రాణీజీ, భగవంతుని సాక్షిగా నా మాట నమ్మండి. మేము మీ విరోధులముకాము. నీవు సహాయం చేయకపోతే మేము ఆకలికి అలమటించి చచ్చిపోతాము. (మోకాళ్లపై కూర్చుండి) ఇహ నిప్పుడు మీదేహోప్. ప్లీజ్ హెల్ప్‌మి ప్లీజ్ హెల్ప్‌మి.

మీర్ చంద్:-నాయభిప్రాయం ప్రకారంగా కొద్ది.

కిరణ్:-మీర్ చంద్ గారూ! మీ యభిప్రాయాన్ని గ్రహించండి. శ్వేతజాతికి సహాయం చేయబడజాలదు.

రాణి:-ఆగుము కిరణ్, తొందరపాటువలదు. విరోధులే అయినప్పటికీ దయాభిక్షపెట్టమని దాపుకొచ్చినప్పుడు వారు మిత్రులైపోయేరన్నమాట. గాన అంత కాఠిన్యం వహించరాదు, ఆంగ్లేయులు మనపై జరిపిన అత్యాచారములకు యీ విధంగా ప్రతీకారం చేయడమంటే మనం కూడా వాళ్లలాగా తయారవ్వడమన్నమాటేగద! ఇది పరాక్రమవంతుల లక్షణంగాదు, పిరికి పందల కృత్యం. మనము భారతీయులము. భారతీయులు, శరణుజొచ్చిన విరోధికికూడా దయాభిక్షు మిడునన్న విషయాన్ని విస్మరించరాదు. లేవండి ఎలిస్‌గారు! చెప్పండేమిగావలెనో?

ఎలిస్:-పిల్లల, స్త్రీల ప్రాణాలు రక్షించండి. ఫోర్టులో దిగ్బంధన చేయబడ్డవారికి అన్నపానీయాలు యేర్పాటుచేయండి.

రాణి:-బాగుగనేవుందిగాని, తమరు మమ్మే పరిస్థితుల్లో వుంచిందీ చూస్తూనే వున్నారుగదా. సైన్యమూ లేదాయె. తగినంత ధనమూ లేదాయె. అయినప్పటికీ మీబిడ్డపాపలను, స్త్రీలనూ, నిర్భయంగా, రాజమహాలుకు పంపించమని చెప్తున్నాను. నాబొందిలో ప్రాణమున్నంతవరకు వారికే యిబ్బందీ కలుగదని హామి యిస్తున్నాను. కోటలో దిగ్బంధమందున్నవారికి చాలినన్ని పూరీలు పంపబడును. ఇంక నావల్ల నేమగున్నో చెప్పండి? చేస్తాను.

కిరణ్:-అయితే యీ వుపకారంవల్ల లాభం?

రాణి:-ఉపకారం చేయడంవల్ల లాభమెప్పుడూ వుంటుంది కిరణ్! యీ స్త్రీలతోనూ, పసికందులతోనూ మనకు వైరమేమిటో కొంచెమాలోచించుము కిరణ్! మనకు శత్రువులు ఆంగ్లేయులు కాదు, ఆంగ్లపాలన, ఆంగ్లప్రభుత్వం, ఆంగ్లరాజ్యం. యీవుపకార మూరక నేపోదు. హిందూదేశపు రాణియెడ ఆంగ్లేయులెంత విశ్వాస ఘాతుకంగా ప్రవర్తించినప్పటికీ, ఆమె యిలాంటి వుపకారాలే ఆంగ్లేయులకు చేసిందని చరిత్ర చదివే ఆంగ్లేయులెప్పుడూ చదువుకొంటూ వుంటారు. ఇదేమి సామాన్య విజయమా? వెళ్లండి ఎలిస్‌గారు అన్నీ యేర్పాట్లు చేయబడును.

ఎలిస్:-భగవంతుడు మీకు మేలుచేయును.

(వెళ్లును)

రాణి:-సోదరీ పద; మనకుకూడా చాలా ఆలస్యమైనది. అత్యవసర విషయాలను

గురించి మనము సాంగోపాంగముగా తర్కించుకోవలసియున్నది.

(వెళ్లిపోదురు)

ప్రథమాంకం సప్తమరంగం

[కోటయందొక భాగం - తిరుగుబాటుదార్లసమూహం - ఫిరంగు లెక్కపెట్టబడియుండును - గలభాగావుండును. కాలేఖాన్ వగైరావారు శాంతపరచుచుందురు.]

కాలేఖాన్:-సోదరులారా, శాంతించుడు. కోటంతయూ మనవశమైనది. ఆంగ్లేయులున్న ఆకొద్దిభాగం మాత్రం, అలావుంది. అదికూడా స్వాధీనమైతే ఆంగ్లేయుల కాస్కారమే లేదికను. అంతా స్వాధీనమైన పిమ్మట ఝాన్సీ రాజ్యాన్ని సంబాళించే దెవరాయన్న ప్రశ్న వుదయిస్తోంది? తర్కవితర్కాలు, స్వాభిప్రాయాలు వదలండి. నిన్నటిలాగా ఆంగ్లేయులను హాతమార్చునట్లైన బైటనుంచి యింకా ఆంగ్లేయసేనలొచ్చును, యుద్ధం జరుగును. ఇప్పుడు మనకు అవసరంగా కావలసింది ఒక అధికారి. దేశప్రజలు యావత్తూ ఝాన్సీరాజ్య సింహాసనంపై రాణి కూర్చుండగా చూడ కుతూహలురైయున్నారు. అదే అదృష్టంగా భావించుకుంటున్నారు. దాన్నే సుస్థిరంగా వుంచాలనుకుంటున్నారు. ఇందుకోసమే సర్దార్ గురుబక్ష్‌సింహ్, మహారాణీగారితో సంప్రదించడానికి వెళ్లేడు. రాణీగారుకూడా అందుకంగీకరించునన్న నమ్మకవుందిమరి.

అందరూ:-'మహారాణీ లక్ష్మీబాయికీజై' మహారాణిగారు తప్పక అంగీకరించును. ఆమె మనకెల్లరకూ మార్గదర్శకురాలు కావలయును.

కాలేఖాన్:-మాతృసమానురాలగు మహారాణిగారి, యాశీర్వాద బలమువల్ల ఝాన్సీరాజ్యమందలి ఆంగ్లేయులు ఖాళీ అయ్యేరు. ఇప్పుడికను దోపిడీగాండ్రగు విదేశీయులను, దేశమంతటినుంచీ ఖాళీ జేయించాలి. అంతవరకును మనము నిద్రపోరాదు. మన మా మహారాణి అండను పెరిగేము. అందువల్లనే మళ్లీ రాజ్యభారాన్ని ఆమెయే స్వీకరించాలని కోరుతున్నాం. ఆమెయే మనల పాలించి పోషించాలనుకుంటున్నాము.

అందరూ:-గద్దెపై కూర్చుండుటకు తప్పక అంగీకరించాలి! అంగీకరించాలి!

కాలేఖాన్:-సైనికులారా! మీరు పరాక్రమవంతులగు ఝాన్సీ సైనికులనీ, ఝాన్సీరాజ్య వుద్ధారకులనీ నాకు తెల్సును. కాని యీ సమయంలో రాణీగారు మీకు తోడ్పడడానికి అసమర్థత్వాన్ని ప్రకటిస్తున్నట్టి విషయమే విచారకరమైనట్టిది. నిరాయుధులగు

ఆంగ్లేయులను చంపడమూ, శ్వేతజాతి స్త్రీలమీదను బిడ్డలమీదను చేయిజేసు కోవడమూ ధనాన్ని దోయడమూ మొదలగు నీతిబాహ్యమైన కృత్యాలు మీరుచేస్తున్నారు. ఇట్టి దుష్కృత్యాల బలంపైన మీరు ఝూన్సీ రాజ్యోద్ధరణ చేయగలరా? వుద్ధరించబడకపోగా, ఆమెగారుకూడా మీతోపాటు అడవుల పాలు గావలసివచ్చును. మీరు తెల్ల వాళ్లను కొందరిని చంపినమాట వాస్తవం. కాని అందువల్ల మాత్రం ఝూన్సీ స్వతంత్ర రాజ్యం కాజాలదు. ఆంగ్లసైన్యాలు మళ్లీ ఝూన్సీని ఆక్ర మిస్తాయి. అప్పుడు బహుశా మీరంతా పారిపోతారు. ఇది వారివశమవుతుంది. ఝూన్సీకోటలో నిలబడి ఆంగ్లసైన్యంతో తలబడి చివరి నిట్టూర్పువరకూ పోరాడ తామని ప్రతిజ్ఞచేస్తే మహారాణి ఝూన్సీ రాజ్యోద్ధరణకై కృషియొనర్చ ప్రయ త్నిస్తుందని నావిశ్వాసం.

సైనికులంతా:- మేమిక్కణ్ణే నిలబడి ఆంగ్ల సైన్యాలతో పోరాడెదము. చావో బ్రతుకో తేల్చుకుంటాము. వాళ్లను దేశాన్నుండి బైటకుకొట్టి శ్వాస పీలుస్తాము.

(ఆనందోత్సాహాలు)

కాలేఖాన్:-(చేయూపుచూ) శాంతిం చుడు. మీరెల్లరూ రణరంగమున నిలబడి పోరాడుదురని నాకు నమ్మికెట్లు? నిన్నను మీరు పరాక్రమానికి వంక మంటించారు. పవిత్రమైన ఝూన్సీని అపవిత్రమొనర్చారు. తెల్ల వాళ్లు ఝూన్సీలో గోవధ చేస్తుంటే, నారక్తం పొంగులెత్తి, వాళ్లను తన్ని బైటకు తరమాలనే సంకల్పంలో వున్నాను. మీరు స్త్రీ హత్యచేసి అంతకన్నా ఘోర కృత్యం సలిపారు. ఒక్క స్త్రీ హత్య వెయ్యిగోవుల వధకు సమాన మన్న సంగతి మీకు తెలియదను కుంటాను బహుశా.

అందరూ:- మేము వారిని చంపాలనుకోలేదు.

ఒకడు:- వారిని కోటబైటకు గెంటి, విదేశాలకు పంపాలనుకున్నాం మేము.

రెండవవాడు:- వాళ్లను బలిచ్చి భైరవీపూజ చేయాలనుకున్నాము.

(సశేషము)

# ఎందుకోసం-ఇదంతా?

ప్రొఫెసర్ కె. అంజి.

నారదుడు సంగీత ప్రియుడు. సంసారమా - ఏమన్నా - ఏముంది? చేతికబ్బిందేదో తినడం, వూరకే తిరగడం, ఇష్టం వచ్చిందేదో పాడడం. ఎవరికైనా జుట్టు ముడెట్టడం - అతనికి రోజూ నడిచే నిత్యకృత్యాలే యివి.

♦ ♦ ♦

కొన్నాళ్లకి "సంగీతంలో నా అంతటి వాడున్నాడా?" అనే ధోరణికి వచ్చేసాడు—నారదుడు. ఏవేవో తాళపు లెక్కలూ, సరిగమపదనిసాల ప్రస్తారాలు, త్రిశ్రచతుశ్రగతి, ఖండగతిలో మిశ్రగతి, ఇలాంటి సంకలన పల్లవులు తయారించి గులకరాళ్లమీద దొర్లిపొయ్యే బండి సుఖంలాగా సంగీతం తయారించుతుండేవాడు. అమ్మ బాబో! కవిత్వమేమన్నా వచ్చేవుంటే బ్రతుకనిచ్చేవాడు కాడు.

♦ ♦ ♦

పదిమంది గుంపులున్న, ఓసభ చేరబోతున్నా, ఓ యింట్లో ఉన్న నలుగురు సుఖంగా వుంటారని తెలిసినా వీడు అక్కడికి హాజరు. వచ్చాడంటే ఏదో మూడిందన్న భయం ప్రాకిపోయింది ప్రజకు. నారదుని రాకకుముందే గుర్తుగా అతని ఎగుడు దిగుడు సంగీతం, తాళపు చిరతుల సంరంభం వినొచ్చేది. "పిల్లిమెళ్లో గంటలాగ!" వెంటనే ప్రజలు పరారు చిత్తగించేవారు. కొందరు విధిలేక దొరికిపొయ్యేవారు అతనికి. ఇంక వాండ్లపని ఆసవొదలుకోవలసి వచ్చేదే! మెలికలు తగిలించడంలో ఆంధ్రరాష్ట్రపు మెలికలకంటే ఎన్నో రకరకాల మెలికలు అతనికి సహజంగా వదిలేవి. ఈ పోదు తప్పుకోవడం ఎలాగా అని మూడులోకాల వారికి తోచింది కాదు. ఇదే గడ్డుసమస్యగాకూడా మారింది.

♦ ♦ ♦

తుంబురుడు నారదునికంటే పండితుడు కాకపోయినా మధురంగా పాటలుపాడి విజయం పొందాడు నారదుణ్ణి ఓడించి! ఆ దెబ్బతో నారదునికి మతీలేపోయింది. చిన్నోడిచేతిలో ఓటమి అతనికి ప్రాణాలమీద విసువుకల్గి విషంకోసం కైలాసానికి వెళ్లాడు; అలాగైనా చావు దొరుకుతుందేమోనని. పండితుడికి ధనంకంటే ప్రాణంకంటే అవమానానికే వెరుస్తాడు, తెగిస్తాడుకూడా!

♦ ♦ ♦

తనకైవచ్చిన నారదుణ్ణి కూర్చోబెట్టి, విషయం తెలిసాక శివుడు "నారదా! ఇదంతా దేవతలు చేసినఎత్తు. ఇంత మాత్రపు దానికే చస్తారా? నీకో విషయం చెప్తావిను శ్రద్ధగా" అన్నాడు. నారదుడు ముందుకొచ్చాడు - వినడానికి. శివుడు చెప్పసాగాడుఇలా - "నీవు సత్యభామవద్దకెళ్లు. ఆమెకు తెలసిన సంగీతం వీళ్లెవ్వరికీరాదు. ఆరునెలలు మకాం వెయ్యి అక్కణ్ణే! గుప్‌చుప్‌గా సాధనచేస్కో! ఆ తర్వాత రా! తుంబురుణ్ణేకాదు వాడిల్లాంటి బాబులెందరైనా ఓడిచ్చివేసేస్తుగాని" అన్నాడు. ఈ పథకం నారదునికి నచ్చింది. జైపరమేశా అని పాడుకొంటూ ద్వారకవైపుకు బైలుదేరాడు.

♦ ♦ ♦

నారదునిరాకకు ద్వారకలో "స్వాగతం" యివ్వనివారేలేరు. సభపెట్టించుకొన్నాడు. మాపున

ఉన్న తుంబురదీసి శృతిచేసి పాడసాగినాడు. ఇంతలో ఓఅమ్మ లేచి బైలుదేరి పోవసాగింది. అది చూచేసరికి నారదుని గుండెలు నిలిచిపొయ్యేవే! నిర్ఘాంతం తప్పకొన్నమీదట అతనూ బైలుదేరాడు సభవిడిచి. ముందామె - వెనుక ఈతను. ఆమెవరై యుంటుంది? సత్యభామే!

♦ ♦ ♦

సరాసరి వెళ్లిన "సత్య"భామవద్దకెళ్లి తలపైన నీళ్లు పోసుక్కొసాగింది. నారదుడు వచ్చిపడ్డాడు. నమస్కరించి "అమ్మా సత్యమ్మా! ఎందుకోసం ఇదంతా? ఈ సభంతా! ఈ ప్రయాసమంతా? అంతా నీ కోసమే అమ్మా! నీకు నా సంగీతం విని పిస్తామని గంపెడాశతోవచ్చా దేవలోకంనుంచి. ఎవరికి వినిపించేదమ్మా!" అని బిక్కమొగంపెట్టాడు. - గుడ్లుతేలేసి! సత్యభామ నవ్వు ఆపుకొని "శృతి పెట్టడమే చేతకాక - అపశృతిగా పెట్టావయ్యా! ఆ మీదట సంగీతం పాడుతూవుంటే సర్వాసహ్యంగా పాడావు. ఒక్క అపశృతా ఏమన్నానా? అన్నీ అపశృతులే! అపశృతివింటే "సచేల స్నానం" చెయ్యమన్నారు పెద్దలు. అందుకని స్నానం చెయ్యక తప్పిందికాదునాకు" అంటూ స్నానం చెయ్యసాగింది. నారదుడు కాళ్లమీదపడి విద్యాదానం చెయ్యమని వేడుకొన్నాడు ఆమెను. ఆనాటి నుంచి ఆమె శిష్యుడుగా మారాడు. ఆమె అనేక రహస్యాలు చెప్పింది. మధురమయంగా మారింది అతని సంగీతం. ఆరునెలలయ్యాక దేవలోకం బైలుదేరాడు నారదుడు.

♦ ♦ ♦

నారదుడు తుంబుర్ణి నిజంగా జయించినా దేవతలు మాత్రం విజయుడవయ్యావని అనలా! ఇద్దరు సమానులే అన్నారు కోమటి యుక్తిగావారు. నారదునికే ఛాన్సయిస్తే యింక వాండ్లపనేమాతుందో అనేబెంగ వారి కున్నందున!

♦ ♦ ♦

విష్ణువువద్దకు వెళ్లారు నారద తుంబురులు-తగాదా తీర్చమన్నారు. విష్ణువు "బలేబాగుంది. మీరు పాడడం, నేను తగాదా తీర్చడమునా? నాకంటే గొప్పవాడు "ఆంజనేయుడున్నాడు. ఒక్కసారి మీరక్కడికి వెళ్లండి" అన్నాడోలేదో! ఇద్దరు "థాంక్స్"కూడా చెప్పకుండా బైలుదేరారు హిమాలయానికి.

♦ ♦ ♦

ఆంజనేయుడు తపస్సుచేసుకొంటూవుంటే నారద తుంబురులు తమ తగాదా తీర్చమని గోలెత్తసాగారు. అతను రాగాలాపనతో రాతినికరుగునట్లుచేసి వీరి తంబురా లందుంచినాడు. ఆ రాగం "ఉదయరవి చంద్రిక." ఆకాశంలో సూర్యోదయం అవుతూ వుండగా బహుళపాద్యమినాటి చంద్రుడు పడమట అస్తమిస్తూవుండగా పాడాడు. తంబురాలుంచిన రాయి రాగంవల్ల కరిగింది. మరోరాగం పాడి రాతిని ఘనీభవింపచేసినాడు. తంబురాలు రాతిలో వున్నవి. దేవమునులను "మీరుపాడి మీతంబురాలు తీసుకోమ"ని చెప్పినాడు. వాండ్లు కొన్ని సంవత్సరాలు పాడారు. కాని బండకరగలే! తంబురాలు దొరకలా? హనుమంతుణ్ణి స్తోత్రం చెయ్యసాగారు తిక్కవదిలి! నారద తుంబురులు. అతను పాడి వారి తంబురాలు తీసియిచ్చినాడు. ఎవరివివారు తీసుకొని తిరిగిచూడకుండా వెళ్లపోసాగారు వెనక్కు. ఆంజనేయుడికి చెడ్డకోపం వచ్చేసి వాలాన్ని పంపాడు. వార్ని బంధించి తెచ్చేసి అతని సమీపంలో వదిలింది అది. బిక్కమొగాలు వేసారు దేవమునులు. ఆంజనేయుడు "కలహాలుమాని మీరు

లోకహితానికి పాటుపడండి. లేకపోతే నాతడాక చూపమంటారా ?" అన్నాడు భయంపెట్టూ. బుద్ధిమంతుల్లాగా తలవూపారు ముప్పుతప్పుకోడానికి దేవమునులు. ఆ తర్వాత బైలుదేరారువారు. తుంబురుడు దేవలోకానికి. నారదుడు ద్వారకకు.

♦ ♦ ♦

మరలొచ్చాడు ద్వారకకు నారదుడు అనుకున్నారు ఆ వూరివారంతా ! ఎవరితో మాట్లాడలా నారదుడు. "సత్యభామ సరిగ్గా శాస్త్రం చెప్పలేదు, తగిన ప్రతికారం చెయ్యాలనే" తొందరతో ఆమె అంతఃపురానికి వెళ్ళాడు. "కృష్ణున్ని దానం యివ్వ"మన్నాడు సత్యభామను తనకు. "తర్వాత కొనుక్కో-వచ్చుబంగారమిచ్చి" అన్నాడు. సత్యభామ అలాగే చేసింది కిటుకు తెలియక !" కృష్ణుని త్రాసుసిబ్బిలో కూర్చోపెట్టి బంగారం ఎంతవేసిన "త్సుల" తూగలేదు. అప్పుడు రుక్మిణమ్మ "తులసి" దళమును ఉంచి కృష్ణుణ్ణి గెలుచుకొంటుంది. సత్యభామకు చాలా చిన్నతనం కల్గింది సవతి రుక్మిణివల్ల ! నారదుడు కసితీరి నందుకు నవ్వుకొంటూ బైలుదేరాడు "ఎవ్వరి కెవ్వరికి కలహాలు పెట్టామా" అనుకొంటూ ఆ వూరువదలి...!

——(o)——

# బురద పూరు

### ఇందులోని పాత్రలు

| | | |
|---|---|---|
| భుజంగంగారు | — | కన్యాదాత |
| రమణమ్మగారు | — | కన్యాదాతభార్య |
| బుచ్చితల్లి | — | కన్య |
| గోపాల సుందరంగారు | — | వరుని తండ్రి |
| యజ్ఞయ్యగారు | — | వివాహ సంధాత |

ఒకటో రంగం - భుజంగంగారి యిల్లు

ప్రవేశం భుజంగం, భార్య రమణమ్మ.

రమ:-ఏమండీ, లేవండీ, భోంచేస్తురుగాని.

భుజ:-లేస్తాను, తొందరలేదు గాని మనబుచ్చి తల్లిదే యిప్పుడొచ్చిన పెద్ద సమస్య. ఎక్కడిద్దామని నీ వుద్దేశం?

రమ:-ఆ విషయం యింత తొందరగా తేలేదిటండీ? ఒక్క మాటలో అడిగేశారు! ఆలోచిద్దాంలెండి. భోంచేస్తూ మాట్లాడుదురుగాని, వంట సిద్ధమైంది, వేగిరం లేవండి.

భుజ:-సరే! లేస్తున్నాను, వడ్డించు. ('ఆ" అని ఆవలించును.)

(భోజనం ముందర)

భుజ:-ఏమిటిది? వంకాయా? సరేకాని, మన చిట్టిబాబేడీ?

రమ:-పెందలకడే భోంచేసి సినిమాకెళ్లాడు లెండి.

భుజ:-అయితే సరేకాని, నేనిందాక అడిగిన విషయంలో నీ అభిప్రాయం చెప్పక పోతివి!

రమ: ఏం చెప్పమంటారు? ఎక్కడైనా అనువైనచోట యిద్దాం. ఎక్కడైనా మనకు తెలిసినచోట్లు ఉన్నాయా అసలు?

భుజ:-ఉన్నవి యింకా తెలిసిన వాళ్లను విచారిద్దాం గూడాను.

రమ:-యజ్ఞయ్యగారి చెవినేమైనా వేశారా అసలు? ఆయన యిటువంటివి యెక్కువగా తెలిసిన మనిషి.

భుజ:-ఏదీ నాకీమధ్య ఆయన కలవలేదే!

(టక్ టక్ టక్ తలుపు చప్పుడు)

రమ:-ఎవరు? వస్తున్నా ... నువ్వా? యజ్ఞయన్నయ్యా! నీకు నూరేండ్లాయుస్సు. నీ సంగతే అనుకుంటూండగా వచ్చావు.

భుజ:-మీఅన్నయ్యకు నూరేండ్లు కాకపోతే వెయ్యేండ్లాయుస్సుందాం. గడ్డపారవంటి మనిషి కిప్పుడప్పుడే ఆయనకేంచలనం?

యజ్ఞ:-బావగారి అనుగ్రహంవుంటే ఎంత కాలమైనా బ్రతికేటట్టు ఆశీర్వదించవచ్చు. ఏరీ? లోపల భోంచేస్తున్నారా యేమిటి?

రమ:-అవునన్నయ్యా! రండి యీ పీట మీద మీరుగూడ కూర్చోండి మాట్లాడుదురుగాని, అలవాటేగా మీయింట్లో పెండలాడి భోజనాలై మీరు రావడం, భోంచేస్తూ మేం మాట్లాడ్డమూను.

భుజ:-వెయ్యి వెయ్యి! మీ అన్నయ్య కూచుంటాడు పీటవెయ్యి!

యజ్ఞ:-కూర్చోని పీటవేయించుకోటం మీ అలవాటుకామోను!

రమ:-అంతేలే అన్నయ్యా! ఎవరి అలవాటు మాటలు వాళ్లకొస్తాంటవి. మనకీమాటలతో లెక్కేమిటి? జమేమిటి?

యజ్ఞ:-అంతగాక మరేమిటి? సరేకాని మరీ యీ మధ్య కంటికి పచ్చకర్పూరమై పోయినారేం బావగారు!

భుజ:-నేనేం పచ్చకర్పూరంకాలేదు. నీవే కన్పించకుండా నల్లపూసవైనావుకాని.

రమ:-అన్నయ్యా! సరే కానీండి. నీమేనగోడలు ఋచ్చితల్లికేవైనా మంచి సంబంధాలుంటే చెప్పండి.

యజ్ఞ: సంబంధాలకేమమ్మా! ఉన్నయి, మంచి సంబంధాలే ఉన్నయి. మీ ఆయనకు నచ్చవద్దూమరి.

భుజ:-నాకు నచ్చకేం బావగారు! మీ అమ్మాయికి మీరు నచ్చజెప్పుకోవాలిగాని.

రమ:-అవును పాపం నన్ను ఒప్పించటమే కష్టం కదూ! సరేలే! చెప్పండిఅన్నయ్యా! మీబావమరది మాటలకేమొచ్చె?

యజ్ఞ: అమ్మా! లక్ష్మీపురం పేరు విని వున్నారా? అక్కడొక సంపన్న గృహస్థు కొడుకున్నాడమ్మా! బి. ఏ. దాకా చదివాడు. మంచి బుద్ధిమంతుడు, తెలివైనవాడు. అందచందాల్లో ఏమీలోపంలేదు. వాళ్ల వూరికి సమీపంలోవుండే ఫ్యాక్టరీలో మంచి వుద్యోగంచేస్తూ మంచి జీతమే సంపాయిస్తున్నాడు. ఇంకా మంచిజీతంలోకి పోతాడనుకుంటారు.

రమ: అయితే వయస్సు ఏమాత్రం? స్థితిగతులేమిటి?

యజ్ఞ:-మనఅమ్మాయికి తగినయీడేనమ్మా! 19 సంవత్సరాలు సుమారుంటాయి. ఇక ఆస్తిపాస్తులంటావా? ఒకయాభై యెకరాలు మెరకభూమి మంచిదే వున్నది. మామూలు పల్లం మాగానికూడ పది యెకరాలకు తక్కువ వుండదు. నిలవ డబ్బు పదివేలకున్నట్లు చెప్పుకుంటారు. ఈకవెల సంగతి యిదమిత్థమని నిశ్చయించటానికి వీల్లేకపోయినా, ఏడెనిమిది వేలకు తగ్గదు.

భుజ-అయితే మనకసలు అందుబాటులో వుంటుందా యీ సంబంధం? కట్నం ఎంతమీదవుంది?

యజ్ఞ:-అదుగో. మా బావగారప్పుడే భయపడి పోయినారు. ఎంతో కట్నం అడిగి తన యినప్పెట్టె ఖాళీచేయిస్తారేమోనని.

రమ:-అన్ని విధాలా నచ్చితే కట్నంయిస్తే మాత్రం యేం లెంకి అన్నగారూ! ఒకరికి మాత్రం యివ్వక తప్పుతుందా? అయితే అన్నగమ్ములు?

యజ్ఞ:-ఇదర్లేనమ్మా! మంచి ఉత్తమమైన వంశంకూడాను మా బావగారను కున్నంతగా భయపడనవసరము లేదు కూడ. వాళ్లు కేవలం కట్నాలమీదే దృష్టికలవారు కాదు. ఏదో యథోచితమైన సత్కారం కోరేవారే కాని మరోటికాదు.

రమ:-అయితే యింకా మనం చూచుకో దగ్గ విషయాలేమిటి?

యజ్ఞ:-గ్రామంగూడా తృణకాష్ఠ జలసమృద్ధమైందే. వాళ్ల తాలూకా గ్రామం నుంచి, యితర పట్నాలనుంచీగూడా మోటారు వగైరా ప్రయాణ సౌకర్యాలున్నాయి. తల్లిదండ్రులు చాల అత్యుత్తములు. వాళ్లకూ చాలా సంబంధాలు వస్తున్నై. కాని వాళ్ల వుద్దేశం మంచి సంప్రదాయంకలిగి, అణిగిమణిగి ప్రతిష్ఠ తెచ్చే పిల్లకావాలని. అందుకనే యింతవరకేదీ ఒప్పుకోలేదు.

భుజ:-అయితే మనకు కావచ్చునంటారా యీ సంబంధం?

యజ్ఞ:-ఓ, తప్పకుండా. వాళ్లు చూస్తున్న సంప్రదాయం వగైరాలు మనపిల్లలో అన్నీ వున్నాయి. కనుకనే నేను మీకిది యింతగా చెప్పగలిగాను.

రమ:-అయితే యింకెక్కడన్నా సంబంధాలు?

యజ్ఞ:-లేకేం ఉన్నై. ఇది కాకపోతే యింకోటి చూచుకుందాం. ఇది అన్ని విధాలా మనకు తగింది. కాబట్టి యిది కోసి ఫలంలో యింకోదాని విషయం ఆలోచించాలిసిందే. వియ్యానికైనా, కయ్యానికైనా సమంగా వుండాలమ్మా! కాబట్టి యిది మీతో సరితూగేదే; ఏమీ సందేహంలేదు.

భుజ:-అయితే బావగారూ! ఒకసారి వెళ్లి చూచొద్దాం వారి పరిస్థితులు.

యజ్ఞ:-ఎందుకండీ? ముందుగా వారువచ్చి పిల్లనుగనుక చూచుకొని, పిల్ల నచ్చిందని అంటే అప్పుడు మనంగూడా వెళ్లి చూచి, యేదో రకంగా ఖాయంచేసుకొద్దాం. అంతేగాని ముందుగా మన మవసరంలేదు.

రమ:-అట్లా అయితే ముందు వాళ్లిక్కడికి వచ్చే ప్రయత్నం చేస్తారూ?

యజ్ఞ:-బావగారి ఆజ్ఞ అయితే అట్లాగే నమ్మా! మన దేమున్నది?

భుజ:-అవునుమరి. మీ యిద్దరూ భయంగలవాళ్లుగనుక నా ఆజ్ఞకోసం నిరీక్షిస్తున్నారన్నమాట. అయితే యింకేం కానీండి.

యజ్ఞ:-చిత్తం చిత్తం, కానీండి. పొద్దుకూడా పోతుంది, వెళ్లివస్తాను.

(సశేషం)

అవ్వారి వాసుదేవశాస్త్రి

———o———




త్రికాలవేది, జ్యోతిష్యచక్రవర్తి, ప్రొఫెసర్ కె. ఆంజి

### మేషం :

ఖర్చు తగ్గించుకోలేరు,-వాతాధిక్యంగా వుంటుంది, లాభంమీద చూపు అధికం అవుతుంది, ప్రయాణాలుంటవి, శుభాహ్వానాలుంటవి, బంగారు వస్తువులు కొంటారు, శత్రువులు లోకొట్టుకొన చూస్తారు, మీకు సలహాలిచ్చేవారు ఈ మాసంలో వుండాలి, చిన్నలకు చిక్కులు ఉత్సాహీనం. దైవారాధన శ్రేయస్కరము, శ్రమ తగ్గించుకొంటారు. రాజచూపు, ప్రభుత్వపు ధనం యివ్వాలనివస్తుంది, శిస్తుచిక్కులుంటవి, ఋణదాతల తొందరలు, ధన ఆదాయంకద్దు.

### వృషభం :

కానికూడ ఖర్చుపెట్టకూడదని బిగపట్టడంవల్ల సర్వ్యాలు వ్యతిరిక్తులౌతారు. తాంబూలం అలంకారాది వస్తువులపై మక్కువ అధికం, ఒప్పందాలు చెల్లనేరవు, మాట తప్పుతు వుంటారు, ఇష్టులు అయిష్టాలు ప్రదర్శిస్తారు, కుటుంబవృత్తి వ్యవహార వ్యాపారాదులలో పోటీలుంటవి, ధనం అధికంగా వస్తుందీ, మూర్ఖం వదలడంవల్ల కాని పనులు అవుతవి, ఆభరణాలు వస్తవి, చిన్నలకు ఔన్నత్యం, ప్రదర్శన ఫిలిం వ్యాపారాదులందు లాభాధిక్యం, సినిమా నాటకాది ప్రదర్శనాలకు రమ్మని చాలా ముఖ్యులు తొందరిస్తారు, ఎవరి డబ్బు మీదనో మీ పెత్తనం సాగించుతారు.

### మిథునం :

బలేమంచికాలం! చాకలో అధిక లాభాన్ని సాధించుతారు, వేదాంతగోష్ఠి, మహాస్థలాలు, మహాగ్రంథాలు నిర్మించడం చదవడం వుంటుంది, దైవసహాయంవల్ల ఆపన్నివారణం, దాయాదులకు నష్టం, శత్రుబాధా నివారణం, గర్వాభివృద్ధి, విశ్వవిజయులవుతారు, అఖండైశ్వర్యప్రదం, చరస్థిరాస్తుల వికాసం, మంగళకార్య చరణాములకై చేయు వ్యూహములు అన్నీ అనుకూలించుతవి. రత్నాభరణ సేవక వృత్తి వ్యాపార వాహనములు మార్తాయి. గృహమార్పు, స్థానచలనం.

### కటకం :

సద్గోష్ఠి, మహాత్ముల చూచుట, ఆనందం, కార్యవిజయం, సన్మానము పొందుట, గ్రంథలాభం, విద్యా

ప్రీతి, చిన్నలకువృద్ధి, పెద్దలకు క్షీణం, పుణ్యక్షేత్రాది దర్శనం, కాని పనులు అవుతవి, గొప్పవారి రెకమెండేషన్లవల్ల గవర్నమెంటు అనుకూలం అధికారం సిద్ధించిని యోగం, మంచి వార్తావళి, చిత్రవిచిత్రాలు చూస్తారు, ఆభరణం, ఇనప సామానులలో లాభకరం, కొత్తమైత్రి,

## సింహాం :

దూరపువారిని చూస్తారు అకస్మాత్తుగా, దిగులుగావున్న మీమనస్సు ఒక్కసారి సంతోషంగా మారుతుంది, చిత్రవిచిత్రలపై ప్రీతి అధికం అవుతుంది, శృంగారప్రీతి, ప్రయాణం, స్థానచలనం, ఉన్నతి, మిత్రవ్యాప్తి, పశునష్టం, చోరభయం, విషజంతుభీతి, చెదరనివృత్తి, మందంగా కార్యాదులు అవుతూ వుంటవి.

## కన్య :

ఇతర్ల మాటలువిని ముందుకు పోవరాదు, కోపాధిక్యం, చర్మవ్యాధులు పొడలు గడ్డలు రావచ్చు దీన్ని పోగొట్టుకోవడానికి నూనెతో అభ్యంగనాదులు అధికం చెయ్యండి, పనిని తగ్గించుకొనక పోతే శరీరం అలసట చెందుతుంది, నీచులు బెదిరించి డబ్బు వసూలు చెయ్య చూస్తారు, చిన్నలకు శుభం, శక్తివృద్ధి అవుతుంది, స్థిరాస్తుల పెంపకం, కలహాలు నిర్నిమిత్తంగానే వస్తూవుంటవి, మిత్రద్రోహంవల్ల ఆందోళనం వుంటుంది, రాజధన సహాయం వ్యవహారాలుకూడ.

## తుల :

డబ్బు వస్తుంది, ప్రయాణాలు శుభం, చిన్నల విరుద్ధం, రాజసహాయం, వృత్తి వ్యాపారాదులవల్ల అనుకున్న దానికంటే హెచ్చుగా లాభించుతుంది, ఆరునెలల క్రిందటికంటే ప్రస్తుతం రోజులు చాలా మంచివి, ఈ మాసంనుంచి, ఎన్ని పనులు చేసినా అన్నీ మీకే జయాన్ని యిస్తూవుంటవి, ఆదర్శాలు పెట్టకోరాదు, యుక్తిగా మెలగడంవల్ల లక్ష్మిని పెంచుతారు, రాత్రి నిద్ర పట్టదు, నీచులతో తగాదాలు రాగలవు, పోలీసు సహాయం ఎందుకైనా మంచిదే !

## వృశ్చికం :

అవిశ్వాసం తరుచు పీడిస్తూ వుంటుంది, మిత్రలాభం, పనితొందరలు, వ్యతిరేకులు అధికంగా బైలుదేరుతారు, రత్నాభరణ సేవకవస్తు నష్టం, గృహం మార్పు, అధికవ్యయం తగ్గింపచూస్తారు, అనుకొన్నదొకటి అయితే అయ్యేది మరొకటి అవుతుంది, విచిత్రవస్తు లాభం, కారపు వస్తువులు తినరాదు, మీ విషయంగా మీరు మాట్లాడే దానికన్న ఇతర్ల చేత మాట్లాడించడంవల్ల నష్టాలు రానేరవంటూ గ్యారంటు చెయ్యబడుతుంది, ధనాదాయంకద్దు.

## ధనుస్సు :

చిన్నలకు శుభం, విద్యాజయం, ఆనందజీవనం, గృహాభివృద్ధి, స్త్రీ బంధులాభం, గృహ కుటుంబ గ్రంథప్రాప్తి, సంగీత ప్రియత్వం, కవిత్వాది విచిత్రములపై మక్కువ, గృహాలంకారాదులపై అనుకూల జయం, ఇతర్లను ఒప్పిస్తారు, మీ మార్గంలోకి వార్ని లాక్కొంటారు. ఇల్లు మార్పుగాని, ఇంట్లో వారి మార్పులు కాని కొత్త అదృష్టాన్ని యిస్తుంది, భోగభాగ్యాభివృద్ధి, క్రొత్త కార్య వ్యాపారవృత్తి జయం, క్రొత్తమైత్రి.

## మకరం :

సంతోషం, శుభం, నిష్ఠూరాలు కొందరు ఆడ చూస్తారు, వారికి మీలోపాలు చెప్పడం ప్రమాద

కరం, స్వల్పంలో జారిపడడం తప్పుతుంది, బైలు ప్రదేశంలో సంచరించడంలో దుష్టమృగాలను, జంతు పిశాచాదులవల్ల భయం కల్గుతుంది, కావున తోడు లేనిదే వెళ్లరాదు, అధికంగా మాట్లాడం వల్ల అయ్యే పనులు మీ చేతుల్లో చెర్చుకొంటారు సుమా.

### కుంభం

డబ్బుబాగవస్తుంది, అధర్మంలోకి మనస్సు పోతుంది. దూరదేశంనుంచి ఆత్మీయుల సహాయం కలుగుతుంది.. అదృష్టం బాగా కలసివస్తుంది, ఇస్తామన్న డబ్బు ఆలస్యంగానైనా యివ్వడంవల్ల చెడిపోయిన ఆరోగ్యం మరల చేరుకొంటుంది, వస్తుసామగ్రి యంత్రాదులు కొంటారు, రాజధన ప్రాప్తి, ఇల్లువృద్ధి, బంధుశత్రుజ్ఞాతులు దాసాను దాసులు అవుతారు, 2½ సంవత్సరంనుంచి చెడిపోయినవన్నీ మరల ఒక అదుపులోకి వీనిలాభం కూర్చబడుతుంది.

### మీనం :

అత్యుత్తమ కాలం రాజసహాయం యాత్రా లాభం చిన్నలకుశుభం, సంతాన సౌఖ్యం శుభకార్యం, గృహలాభం మీరు చెప్పిందే న్యాయశాస్త్రం అవుతుంది. దూరదేశంలో మీ వారు మీ బంధు మిత్ర అనుచరవర్గం అంతా సింహాసనాలు పొందుతారు విద్యాలాభం సభాజయం. మైత్రి, అనుకూలం, ఇరుగుపొరుగుల అభిమానం, సంతోషం, మనోరథసిద్ధి.

—(o)—

# లోకవార్తలు

1952-53 సం॥మునకు రక్షణ వ్యయాలక్రింద 158 కోట్ల రూపాయల డిమాండ్లను భారత ప్రభుత్వము ఆమోదించింది.

◆ ◆ ◆

భారత స్వాతంత్ర్యోద్యమచరిత్ర రచనను ప్రధాన మంత్రి నెహ్రూ, రాష్ట్రపతి రాజన్ బాబు, మంత్రి అజాద్ ప్రభృతులతో ఒక ఉన్నతాధికారసంఘం ప్రణాళికలు తయారు చేసికొన సాగిస్తుందిట.

◆ ◆ ◆

మద్రాసు నగరంలోని దాదాపు 30 మంది ప్రముఖ ఆంధ్ర నాయకులు సమావేశమయి జూన్ 10-వ తేదిన యిష్టాగోష్ఠి చర్చలు జరిపి 'మద్రాసు కలిసియున్న ఆంధ్ర రాష్ట్రమే కావాలని, ఏకగ్రీవ నిర్ణయం చేశారు. సమావేశమయిన నాయకులలో శ్రీయుతులు టంగుటూరు ప్రకాశం, సర్. యస్. వి. రామమూర్తి, బులుసు సాంబమూర్తి, సామి వెంకటాచలంచెట్టి, టి. యస్. వెంకట్రామన్, కర్నల్ శాస్త్రి, ఓబుల్ రెడ్డి, కె. సూర్యనారాయణగారలు కలరు.

◆ ◆ ◆

కంట్రోల్సు రద్దు అనంతరము అనేక ప్రాంత్యాలలో పుష్కలంగా బియ్యం అమ్మకం జరుగుచున్నదని వార్తలు.

◆ ◆ ◆

వర్షాలు పుష్కలంగా కురవడంవలన మన రాష్ట్రంలో అనేక ప్రదేశములందు నీటి ఎద్దడి తీరింది.

◆ ◆ ◆

చైనాలో దాదాపు 5 వారాలపాటు పర్యటించి భారత సాంస్కృతిక ప్రతినిధి వర్గంవారు యీనెల 7 వ తేదిన స్వదేశానికి తిరిగివచ్చారు.

◆ ◆ ◆

మలేరియావల్ల సాలీనా వెయ్యికోట్ల నష్టము కలుగుతున్నదనియు, ఈ వ్యాధిని నిర్మూలనకు ఇండియన్ మలేరియా ఇన్‌స్టిట్యూట్ ఎంతోపని చేస్తున్నదని కేంద్ర ఆరోగ్య మంత్రి అమృత్ కార్ ఢిల్లీ రేడియోలో మాట్లాడుతూ వెల్లడించారు.

◆ ◆ ◆

గుంటూరు నందలి శారదాని కేతనంలో యీ సంవత్సరమునుండి గాంధీ ధర్మములు ఆచరణలో పెట్టబడునని శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు తెలిపారు.

◆ ◆ ◆

ముతక, మధ్య రకం బట్టల ఎగుమతికి అడిగిన వారికి అడిగినట్లు లైసెన్సు లివ్వడానికి భారత ప్రభుత్వము నిర్ణయించింది.

◆ ◆ ◆

ఇటీవల ఎన్నికలలో కాంగ్రెసును ప్రతిఘటించినందుకు క్రమశిక్షణ చర్యగా యు. పి. కాంగ్రెస్ కార్యవర్గము వేయిమందికి పైగా కాంగ్రెస్ వారిని బహిష్కరించారు.

◆ ◆ ◆

ఈ నెల 4-వ తేదిన శ్రీ భూపతిరాజు సుబ్బతాతరాజు, ఆయన సతీమణి స్వామీ సీతారాంగారి

ఆదేశానుసారం ఆంధ్రరాష్ట్ర సత్యాగ్రహం ప్రారంభించారు.

♦ ♦ ♦

దేశములోని నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటకు ఇండియా ప్రభుత్వ కార్మికశాఖ పరిశీలిస్తున్నదని కేంద్ర కార్మిక మంత్రి శ్రీ వి. వి. గిరిగారు బొంబాయిలో ప్రకటించారు.

♦ ♦ ♦

బొంబాయి మాజీముఖ్యమంత్రి శ్రీ బి. జి. ఖేరు ఇంగ్లాండులో ఇండియా హైకమీషనరుగా నియమించబడగలరని వార్త.

♦ ♦ ♦

క్షామపీడితమైన రాయల సీమకు భారత సైన్యము చేసిన సహాయాన్ని అభినందిస్తూ ప్రెసిడెంట్ శ్రీ రాజేంద్ర ప్రసాద్ గారు సర్వ సేనానికి ఒక లేఖ వ్రాశారు.

♦ ♦ ♦

చలన చిత్రాలను ప్రోత్సహించే ఉద్దేశముతో ప్రభుత్వమువారు నియమించిన మోషన్ పిక్చర్స్ అకాడెమీవారు 'జీవితం' చిత్రమును 1950 సం॥ మునకు ఉత్తమ చిత్రంగాను, శ్రీ వి. నాగయ్యగారిని ఉత్తమ నటుడుగాను, శ్రీమతి అంజలిదేవిని ఉత్తమ నటిగా నిర్ణయించారు.

♦ ♦ ♦

సముద్రంలో నావల చలనాన్ని ఆపివేస్తే వర్షం కురుస్తుందని భారత రసాయనిక శాస్త్రజ్ఞుడు తెలియజేశాడు.

♦ ♦ ♦

మద్రాసుపై హక్కు వదులుకొంటే 3 మాసాల్లో ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగుతుందని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు శ్రీ సంజీవ రెడ్డిగారు ప్రకటించాడు.

♦ ♦ ♦

ఈ మధ్య తుపాను ఫలితంగా నెల్లూరు జిల్లాలో విశేషంగా పశునష్టం కలిగింది.

♦ ♦ ♦

నిరుద్యోగంతో బాధపడుచూ జవాను ఉద్యోగానికి పట్టభద్రుడు దరఖాస్తు పెట్టుకొనిన సందర్భమున ఒరిస్సా గవర్నరు ఆసాఫాలీ విచారం వెలిబుచ్చాడు.

♦ ♦ ♦

చక్కెర రేషనింగు రద్దుచేయవలసినదిగా వివిధ రాష్ట్రాలను కేంద్ర ప్రభుత్వము ఆదేశించింది.

♦ ♦ ♦

భూదాన యజ్ఞానికి లక్షయకరాల భూమిని సేకరించడానికి హైదరాబాదు కాంగ్రెస్ నిర్ణయించినది.

♦ ♦ ♦

స్వదేశీ రైలు ఇంజన్లు 1954 నాటికి తయారగునని రైల్వేమంత్రి లాల్‌బహదూర్ శాస్త్రిగారు పార్లమెంటులో ప్రకటించాడు.

♦ ♦ ♦

మే నెల 27-వ తేదిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యగారి 64-వ జన్మదినోత్సవం వివిధ ప్రాంత్యాలలో జరిగింది.

♦ ♦ ♦

కాంగ్రెస్ వార్షిక సభను యీ సంవత్సరాంతమున హైదరాబాదులో జరుపడానికి నిర్ణయించారు.

♦ ♦ ♦

సోషలిస్టు ప్రజాపార్టీ అవతరణతో ప్రజా సభలో పార్టీ నాయకురాలుగా శ్రీమతి సుచేతా కృపాలినీ గారు ఎన్నుకోబడిరి.

♦ ♦ ♦

పటమటలో మే నెల 30-వ తేదినాడు జరిగిన గాంధీసంఘ మహాసభలో శ్రీ జె. సి. కుమారప్ప గారి అధ్యక్షతన వచ్చే ఏడాదిలోపల ఏవిధమయిన పరిహారము లేకుండా అన్ని రకాల భూస్వామ్య విధానం రద్దుపరచి 1953 మార్చి 31-వ తేదినాటికి దున్నేవారికి భూమిని సమానంగా పంచుటకు వీలుగా రాజ్యాంగ చట్టాన్ని సవరించవలసినదిగా భారత ప్రభుత్వాన్ని అర్థించాలని ఒక తీర్మానం చేసింది.

♦ ♦ ♦

ఈ మధ్య కురిసిన వర్షముల మూలంగా మద్రాసు నగరమునకు సంవత్సరమునకు పైగా సరిపోయే నీరు సమకూరినది.




# సత్యమే జయము

కుమారి గుళ్లపల్లి నాగరత్నం

పూర్వము రామమూర్తి అను ధనికుడు అతని భార్యతోకూడ ఒక ఊరిలో ఉండేవాడు. వారికి లేక, లేక పుట్టిన మోహనరావు అను కుమారుడు గలడు. ఆ బాలుని వారు అతిగారాబంగా పెంచుతూండేవారు. మోహన్ 4-వ తరగతి చదువుతున్నాడు. చాలా మంచివాడు. ఎన్నడూ అబద్ధంచెప్పి ఎరుగడు.

రామమూర్తి కుటుంబము నివసిస్తున్నది ఒక పెద్ద భవనం. చుట్టూ అనేక రకముల చెట్లతోగూడిన ఒక ఉద్యానవనము కలదు. అందులోని చెట్లకు ఒక తోటమాలి నీరు పోస్తుండేవాడు. రామమూర్తికి పువ్వుల చెట్లంటే ఎక్కువప్రీతి. తన ఉద్యాన వనంలో అనేక రకాల పువ్వులచెట్లు వేయించేవాడు. అతను ఒకప్పుడు వింతమొక్క నొకదానిని దూరదేశంనుంచి తెప్పించి, తన తోటలో నాటించెను. దానిని ప్రత్యేక శ్రద్ధతో చూడమని తోటమాలికి చెప్పేడు. తను ప్రతి రోజూ, సాయంత్రమువచ్చి దానిని చూచి పోతూండేవాడు. కొన్నాళ్లకు ఆ మొక్క పెరిగి, పెద్దదై, వింతయైన పూలు పూసేది.

ఒక రోజున మోహను తోటలో పచారు చేస్తుండగా ఈ వింత చెట్టును చూడటం తటస్థించింది. దానినిచూచి, అతను చాలా ఆశ్చర్యపోయేడు. "ఈ చెట్టును మానాన్నగారు ఎక్కడినుంచో తెప్పించినట్టుంది. ఇలాంటిచెట్టు మాబడి తోటలో వేస్తే ఎంత బాగుంటుంది! దీని కొమ్మ ఒకటి కొట్టి తీసుకెళ్లి బడి తోటలో నాటుతాను. ఇప్పుడు నాన్నగారు ఇంట్లో లేరు; తోటమాలి నీళ్లుపోసి వెళ్లిపోతాడు. అపుడు కత్తితీసుకువచ్చి ఒకకొమ్మ కొట్టివేసి ఆ మూలనున్న పొదలో దాచేస్తాను. రేప్రొద్దున్న నాతోకూడ బడికి తీసుకపోతాను" అని అనుకొని ఇంట్లోకి పోయేడు.

మోహనరావు వెళ్లిపోయిన తరువాత తోటమాలివచ్చి, మొక్కల కన్నింటికి పాదులు తవ్వేడు. నూతినుంచి నీళ్లు తెచ్చి అన్ని చెట్లకు పోసేడు. తనపని పూర్తి కాగానే, యింటికి వెళ్లేడు.

ఇదంతా గది కిటికీలోంచి చూస్తున్న మోహను, మాలి వెళ్లగానే ఒక జార్రైన కత్తి తీసుకొని తోటలో వింతచెట్టు దగ్గరకి వచ్చేడు. పువ్వులతోవున్న మంచి కొమ్మను కొట్టివేసి, మూలనున్న ఒక పొదలో దాచేశాడు. మళ్లీ చల్లగా తన గదిలోకి పోయేడు.

మోహను నాన్నగారు రోజూ అలవాటు ప్రకారం వింతచెట్టు దగ్గరకొచ్చి చూసేసరికి, చెట్టు చిన్నపోయిఉంది. కొమ్మ నరకబడినట్టు కనిపించింది. ఇది చూచి అతనికి తీవ్రమైన కోపం వచ్చింది. వెంటనే మాలీకి. కబురు పంపాడు. వాడు రాగానే చెట్టు చూపించి "ఎవరు దీని కొమ్మ కొట్టారు ?" అని అధికార పూర్వకంగా అడిగేడు. పాపం, తోటమాలి భయపడిపోయేడు. "నాకు తెల్దండీ, బాబూ. నేను ఇందాక పాదితవ్వి, నీళ్లు పోసి ఎళ్లేను. అప్పటికి చెట్టు బంగార్లాగుంది. ఎవరికి ధైర్యం ఉందండి ఆ చెట్టు నరకడానికి! మోహనబాబు పువ్వులు బాగున్నాయని, అజ్ఞానంచేత కొట్టశారేమో!" అన్నాడు తోటమాలి చేతులు జోడించి. "ఏడీ, ఆ మోహన్నిలా పిల్చుకురా" అని రామ్మూర్తి చేతిలోఉన్న పేపబెత్తాం ఊపుతూ అన్నాడు.

వెంటనే మాలివెళ్లి మోహన్ని తీసుకొచ్చేడు. అప్పుడు రామమూర్తి, "ఒరే, మోహనా! ఎవర్రా ఆ చెట్టుకొమ్మను నరికినది ? నిజంచెప్పు. లేకపోతే ... చూశావా ఈ బెత్తం."

నాన్నగారి ఉగ్రాకారంచూసి మోహనరావు హడలిపోయేడు. ఏడుస్తూ "నేనే, కొట్టానండి! ఈ చెట్టు చాలా బావుందని, మాబడి తోటలో వేద్దామనుకున్నా. అంచేత, ఓకొమ్మ ఇందాక మాలీ వెళ్లిపోయిం తరువాత, కొట్టేను. అదిగో, ఆ తుప్పల్లో ఉంది." అని చెప్పి ఆ కొమ్మ తెచ్చి తండ్రి ఎదుట పెట్టేడు.

రామ్మూర్తికి, తన కొడుకు తప్పు చేసినా, అడిగేసరికి నిజం చెప్పినందుకు ఆనందించేడు. బడికోసం, తన తోటలోని చెట్టుకొమ్మ తీసుకు వెళ్లడానికి ప్రయత్నించడంలో, ఆ బాలునికి తన బడిపైగల అభిమానము తెలిసికొని మురిసిపోయేడు. అతని కోపమంతా ఒక్కమాటు ప్రేమక్రింద మారిపోయింది. కుమారుని బుజ్జగించి, చెట్టుకొమ్మనాటితే, చెట్టురాదనిన్నీ, చిన్నమొక్క పాతితే అది పెరిగి పెద్దదవుతుందని చెప్పేడు. మోహన బడిలో వేయడానికి ఆ రకం ఇంకొక వింత మొక్కను తెప్పించి, మోహన్‌చేత బడిలో నాటింపించేడు. "నేను మా నాన్నగారితో సత్యము చెప్పబట్టిగదా! నేను తలచిన కార్యము జయప్రదముగా నెరవేరింది. అంచేత నేను ఎల్లప్పుడూ సత్యమునే చెప్తాను" అని మోహనరావు అనుకొన్నాడు.

——(o)——




రావణుని వధించిన రాముడు రామేశ్వరంలో శివాలయం కట్టించినా శనిబాధ తొలగలేదు. అయోధ్య చేరినాక ఆ మహా చక్రవర్తి వసిష్టునితో తన ఆందోళనను మనవి చేసినాడు. గ్రహనీత గణిత సాధనంచేసి శనిబాధ వున్నమాట నిజమే అంటూ 12 ఏండ్లు మూడు వేళల సంధ్యావందనం చేసిన వానికి శనిదానం పుట్టెడు నువ్వులు పుట్టెడు బంగారంతో యివ్వాలనిందనిచెప్పి తన ఆశ్రమానికి వెళ్లినాడు-ఆయన.

♦ ♦ ♦

రామదూతలు, 72 వెల్లువల కపిదళంతో సహా సర్వలోకాలు గ్రామాలు దండోరావేస్తూ తిరిగినారు. కంట్లో కలికానికైనా ఒక్కడుకూడా కనుపించలేదు మూడు సంధ్యలు సకాలంలోచేసిన మహానుభావుడు. కొందరు వుదయం సంధ్య సకాలంలో చేసాం అని, కొందరు సాయంకాలం సంధ్య సకాలంలో చేసామని, మరికొందరు రెండువేళల సంధ్యలు సకాలంలో చేసాముకాని మధ్యాహ్న సంధ్యమాత్రం సకాలంగా చేసామన్న నమ్మకం మాకు లేదన్నారు. గౌతముడు మూడు వేళలు సకాలంగా చేసానుకాని ఈ 12 ఏండ్లల్లో ఒక్కనాడు మధ్యాహ్నం సంధ్యా వందనం సకాలానికి చెయ్యలేదని చెప్పినాడు. అందరు తెల్లముఖాలతో వచ్చేసినారు.

♦ ♦ ♦

వసిష్టుని రావించి శ్రీరామచంద్రుడు "ఎవ్వరు దొరకలేద"ని నివేదించుకొన్నాడు. ఆయన చిరునవ్వు నవ్వుతూ "మనదొడ్లోవున్న మందుమొక్కను మనం తెలుసుకోజాలం" అన్నాడు.

రాముడు:- అలాగైతే మన రాజ్యంలోనే ఆ మహానుభావులు వున్నారా?

వసి:- రాజ్యంలోనేమిటి? మన భవనంలోనే!

రాము:. ఎవరు వారు?

వసి:- ప్రభువుకు వంటచేసి పెట్టే అతను.

రాముడు:- వంటశాలకు పరుగెత్తినాడు. ఆయనతోబాటు అందరూ వెళ్లినారు.

♦ ♦ ♦

రాముడేవచ్చి తన పాదములందు పడడంచూచి దిగ్భ్రాంతి చెందినాడు వంటాయన. వసిష్టుడు "శనిదానం దీసుకోమని" చెప్పినాడు. "ఆ పాపం పొయ్యేదెలాగా" అన్నాడు అతను. "కాశీలో అగస్త్యుడు గంగా స్నానానికి ప్రతినిత్యంవచ్చి వెళ్తూ వుంటాడు. ఆయన స్నానంచేసి బైటికివచ్చేటప్పుడు నీటిబిందువులు నీమీద పడితేచాలు శనిదోషం అంతాపోయి నీవు పునీతుడౌతావు" అన్నాడు.

♦ ♦ ♦

వంటతను కాశీలో ఎదురుచూస్తూ ఎన్నో నాళ్లున్నా అగస్త్యుని దర్శనంకాలేదు. మరల వసిష్టునివద్దకు వచ్చినాడు. "అగస్త్యుడు ఏనీచ జాతివాడిగనోవచ్చి రోజూపోతూ వుండొచ్చు. ఎవడైనా సరే! నాల్గు వేదాలు కుక్కలు చేసికొని వస్తేచాలు. కనిపెట్టు. అతనే అగస్త్యుడని, గంగా ఘాటులన్నిటిని ధాన్యపురాశిని వరుసగాచల్లు. ఒక ఘాటులో మాత్రం దారివదలు. అతను అన్ని ఘాటులుచూచి నీవున్న ఘాటుకు వస్తాడు. అప్పుడు నీవు మెట్లమీద పండుకో, చీకట్లో ఆయన నిన్ను తొక్కుతాడు. 'వెంటనే నీ పాతకం పోతుంది" అంటూ సలహా చెప్పిపంపినాడు అతనికి.

వంటవాడు వసిష్ఠుని ఆదేశప్రకారం చేసినాడు మరునాడు నాలుగుకుక్కపిల్లలు చంకెట్టుకొని ఓపిచ్చివాడు తానున్నవైపుకు వచ్చినాడు. స్నానంచేసి వచ్చే మార్గంలో వంటవాడు పండుకొన్నాడు, చీకట్లో అగస్త్యుడు తొక్కినాడు. "గోమాతా" అంటూ ఆ మహర్షి కేకపెట్టినాడు. అహా నేను బ్రతికివున్నాను. తమవల్ల నాపాపం అంతా పటాపంచలై పోయింది. మీ దయవల్ల నాజన్మపావనత నొందింది" అన్నాడు వంటవాడు. అగస్త్యుడు అంతావిని ఇదంతా వసిష్ఠునిదే పన్నాగడ అనుకొని సంతోషిస్తూ "శ్రీరామ రక్షయే మనరక్ష" అన్నాడు. వంటవానిని వరం ఒకటి కోరుకోమని అగస్త్యుడు చెప్పినాడు. అతను "గోమాత అని మీరు కేకవేసినారు నన్ను త్రొక్కగానే! ఆవు పంచితానికే తమ స్నాన జలబిందుతుల్యత యిప్పించి లోకంలో ప్రజలకు శనిబాధనివారణ చేయించమంటూ, కోరినాడు. "అలాగే" అని చెప్పి అగస్త్య తాను వెళ్లిపోయినాడు.

ఆనాటినుంచి స్నానాల సమయంలో "శ్రీరామరక్ష" అనే వాడుక లోకంలోనికి వచ్చింది. ఆవు పంచిత జలంకరణం పాపవిముక్తికి మూలం అయింది. మనకెన్ని కష్టాలు శనివల్ల వచ్చినా 40 రోజులు ఆవు పంచితం శరీరంపైన చల్లించుకుంటే అదంతా పోతుంది. ఆరోగ్యం కల్గుతుంది. బాధ తొలగుతుంది. కోరికలన్నీ ఈడేరుతవి. సర్వమైలకూడ తొలగిపోతవట. ఇండ్లలో చల్లడంవల్ల భూతప్రేత పిశాచ దృష్టి దోషాలుండనేరవు.

మిసెస్ అంజి

(o)

(335 పేజి నుండి)

రాయలసీమవాసులు, నెల్లూరు పరిసర ప్రాంత్యపు ఆంధ్రులు మద్రాసు నగరం ఆంధ్ర రాష్ట్రంలో చేరియుండకపోతే తాము ఆ రాష్ట్రంలో చేరడానికి సమ్మతించడములేదు. భాషా ప్రాతిపదికపై నిర్మాణము కావలసిన యీ రాష్ట్ర నిర్మాణ సందర్భంలో ఒకేభాష మాట్లాడే ప్రజలు కొందరు ఒక దారిన, మరికొందరు మరొకదారి నడవటంవలన ఎవరికీ లాభముండదు.

ఇక అనాదినుండి మద్రాసులోనే నివసిస్తూ, వ్యాపార వర్తకాలు చేసికొంటూ యుండినవారు, దరిమిలా ఉద్యోగాల నిమిత్తం, వృత్తుల నిమిత్తం మద్రాసుకువచ్చి స్థావరాలు ఏర్పరచుకొని ఆస్థి పాస్తుల సంపాదించుకొని యుంటున్న స్థానిక ఆంధ్రులు తమ భవిష్యత్తును గురించి చెప్పతగినవారుకాని, బయటనున్న వారు మాట్లాడటం సబబనిపించుకోదు.

మద్రాసు నగరం ఆంధ్ర రాష్ట్రంలో చేరి ఆంధ్ర ప్రజానీకం మొత్తము ఒక తాటిమీద నిలబడగలిగిన రాష్ట్రమే కావాలి. అట్టి రాష్ట్రం నిర్మాణము సాధ్యముకానినాడు, యిప్పుడున్నట్లేయుండి ధైర్యంగా తమ న్యాయమైన హక్కులకొరకు పోరాడుతూ, తమ లక్ష్యాలను కుల, మత, వర్గ రాజకీయాలకు అతీతంగా సాధించుకొని గౌరవంగా బ్రతుకడం ఉత్తమం.




# ఖర్జూరపుకాయ

ఖర్జూరపుచెట్టు తాటిచెట్టువలె పొడవుగనుండును. ఆకులు చూచుటకు అందముగను విసనకర్రవలె విరబోసుకొనియుండును. మ్రానుఈతచెట్టును పోలియుండును. సింధు, పంజాబు, ప్రాంతములందును ఆఫ్రికా, ఈజిప్టు, అరేబియా, దేశములందును వృద్ధిగ పెరుగును. విదేశములనుండి మనదేశమునకు దిగుమతియగు మంచి మందు దినుసులలో నిది యొకటి.

ఖర్జూరపుకాయలయందు నైజముగనుండు మాధుర్యము, తగుమయిన ఉప్పు, లోహసంబంధమయిన చేరికకలిగియుండును. ఉపయోగించిన నిండుసత్తువ నిచ్చును. మలబద్ధకమును బోగొట్టును, దాహము నణచును.

చెట్లుపెరుగుభూమిని పరీక్షించిన భూమిలోగల ఖనిజసంపదచే చెట్లుకూడా మందుల కుపయోగపడునని మూలికా విమర్శకులగు ప్రజ్ఞావంతులు కనుకొనియెదరు. గులకరాతి భూములందు యెక్కువగ వృద్ధియగును. గులకరాతి భూములందు సున్నముండి తీరును. అట్టి స్థలములయందు లభించిన మూలికలు, పండ్లు మానవునికి మంచి ఆహారము, ఔషధముగనుండును.

మత్తుపదార్థముల సంసేవనవల్లకల్గు విషనివారణకు 4 ఔన్సుల చల్లని నీళ్లలో 5-6 ఖర్జూరపుకాయలు చితుకగొట్టివేసి 15 నిమిషములు ఫూరనిచ్చి వడబోసి యిచ్చిన మత్తు మాయమగును. కండ్లు మూతలువిడి, స్మృతిని యిచ్చును. అందరకు తెలిసి యుండుట మంచిది.

వేసవి యెండకు తాపమెక్కువై Sun Stroke కలిగిన చంటిబిడ్డలకు, మశూచివేదన వల్ల బాధపడువారలకు, ప్రయాణబడలికవల్ల తారుమారు అయినవారికి ఖర్జూరపుపండ్లు చితుకకొట్టి నానవేసి నీటిని వడబోసి యిచ్చిన దాహము శాంతించును; సేదతీరును. హాయిగ నిద్రవచ్చును.

(సశేషం)




**రానున్న సంక్షోభం: ఫ్రిట్జు స్టెరన్ బర్గ్. అనువాదం విద్వాన్ విశ్వం. ఇంటింటి విజ్ఞానమాల ప్రచురణ. వెల రు 6 0-0**

ఆధునిక రాజ్యాంగ విధానము ఏదయినా ప్రతిపౌరుడు తన బాధ్యతలను తాను నిర్వర్తించవలసిన విధులను తెలిసికొనిననేకాని అభ్యుదయమున కవకాశములేదు. ఇందుకు గాను ఆర్జించవలసిన విజ్ఞానమును ప్రతియొక్కరు విద్యాలయములలో సంపాదించవలసిన అవకాశములు లేని సందర్భములో 'రానున్న సంక్షోభం' లాంటి గ్రంధములు ఎంతైనా అవసరం.

ఈ గ్రంధమును ఇంటింటి విజ్ఞానమాలవారు ప్రచురించినందుకు అభినందనీయులు.

గ్రంధకర్త అపార అనుభవజ్ఞుడు. అనువాదము పయితము చక్కగా నడిచింది. ఇందు నేడు ప్రపంచాన్ని అంతటిని పట్టిపీడిస్తున్న ఆర్థికదుస్థితి, యుద్ధభయము, యుద్ధభయానికి కారణమయిన దేశీయ అంతర్జాతీయ ఆర్థికసమస్యలు వివరించబడినవి. ఇంకా వివిధదేశాలలోని ఆర్థికదుస్థితిని, దాని నివారణకు గల అవకాశములను కూడ గ్రంధకర్త సూచించాడు. ప్రతిదేశము స్థానిక పరిస్థితుల దృష్ట్యా యీ గ్రంధమందలి విషయములను పరిశీలించినచో అనేకసమస్యల పరిష్కారమున కవకాశము కలదు.

ఇది చాల ఉత్తమగ్రంధమనుటలో సందేహములేదు.

**సిరుమారా సాహసం: శ్రీ హరి. ప్రకాశకులు బుక్ మన్స్, మద్రాసు 7. వెల 0-12-0**

పిల్లల పుస్తకాలలో మొదటిది. ఇందలి కథావస్తువు మనోజ్ఞంగా నడిచింది. ఇందలి బొమ్మలు, ముఖచిత్రము కథకు ప్రత్యేకతను సమకూర్చినవి.

కాని యిందలి భాష బాలబాలికల కర్థమయేటంత సరళముగా లేదేమో ననిపిస్తున్నది. కథరసవంతంగా నడుపుటతోబాటు భాషను మరింత సరళమైన ధోరణిలో నడిపియుండినచో బాలబాలికలకు మరింత ఉపయోగముగా నుండెడిది.

అయినా బాలల సారస్వత ప్రచురణకు పూనుకొనిన బుక్ మన్స్ వారు అభినందనీయులు.

**అమూల్య పరిశ్రమలు: శ్రీ ఆర్. బంగారయ్య; ప్రకాశకులు శ్రీ సత్యదేవ్ అండుకో, నజీరుమంజిల్, మోజంజాహి రోడ్డు, హైదరాబాద్ (దక్కన్) వెల 2-0-0**

ఇందులో సబ్బులు, హేరాయిల్సు, ఎసెన్సులు వగైరాలు చేయువిధానములు వివరించబడినది.

ఆంధ్రులకు నూతన పరిశ్రమలను స్థాపించుటకు తగిన అవకాశములను సమకూర్చవలెననెడి యుద్దేశముతో తన కొద్ది అనుభవము, కృషిని పురస్కరించుకొని గ్రంధకర్త యీ పుస్తకమును వ్రాశారు. అంతేకాక నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి ఉపయోగపడగలదని గ్రంధకర్త అభిప్రాయం.

సబ్బులు, హేరాయిల్సు మొదలగు పరిశ్రమలయందభిరుచి గలవారికి యీ గ్రంధము వాస్తవంగా కొంత ఉపకరించవచ్చును.

# సంపాదకీయములు

## రేషనింగు రద్దు

రేషనింగు రద్దయినదను వార్త ప్రజాసామాన్యానికి సంతోషకరమయినదయినా కొందరికి మాత్రం విచారకరమయింది. రేషనింగు అమలు పరచడంలోని ఉద్దేశం మంచిదైనా ఫలితాలు మాత్రము ప్రజలలో విశేష అసంతృప్తికి కారణమయినవి. రేషనింగు రద్దు సందర్భములో నిరుద్యోగానికి గురియయ్యే వారికి ప్రభుత్వము ఏదో విధంగా సహాయం చెయ్యడం ధర్మం.

రేషనింగు రద్దు సందర్భములో మద్రాసు ప్రభుత్వ నిర్ణయం సాహసోపేతమయినదనే చెప్పాలి. ప్రభుత్వోద్యోగులు, పెద్ద భూస్వాములు తమ స్వార్థము దృష్ట్యా యీ నిర్ణయాన్ని వ్యతిరేకించినా ధైర్యముగా రేషనింగు రద్దుకే నిర్ణయించినందుకు రాజాజీ మంత్రివర్గము అభినందించతగినది. ఈ నిర్ణయము ప్రజాసామాన్యపు దుర్భర ఆర్థిక జీవితాన్ని దృష్టిలో నుంచుకొని వారి శ్రేయస్సు దృష్ట్యా జరిగింది.

అయితే రేషనింగురద్దు అయినదనంగానే కడుపు నిండుతుందని సామాన్య ప్రజలు సంతోషించరాదు. క్రొత్త పాత సందున ధాన్యము ధర ఒడిదుడుకుగా నుంటుంది. పరిస్థితులు నిలకడ ఏర్పడినదాక రేషనింగు రద్దువలన ఏర్పడిన సత్ఫలితాలను ప్రజాసామాన్యము పూర్తిగా పొందలేదు.

ఈ సందర్భములో కొనుగోలు శక్తిగలవారు సయితము తమ అవసరాలమేరకు కొనుక్కోవాలిగాని అత్యధికంగాకొని నిలవచేసికొనడంకూడదు. తమ అవసరాలు తీర్చుకొనుట నుద్దేశించి వ్యవహరించాలి. తమకు అవకాశమున్నచో ఎచ్చటినుండైనను ధాన్యము తెచ్చి ప్రజల అవసరాలను తీర్చగలమని చాటుతూయుండిన వ్యాపారులకిక అభ్యంతరముండదు. బహిరంగ వ్యాపారము ద్వారా ప్రజలలోని అసంతృప్తి, ఆకలిదప్పులు శమించగలవని మావిశ్వాసం.

## ఆంధ్రరాష్ట్రము - సత్యాగ్రహము

స్వామి సీతారాంగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకుగాను నిరాహారదీక్ష పూనారు. ఆయన ఆరోగ్యం దినదినానికి ఆందోళనకరంగా నున్నదని వార్తలు వస్తున్నవి. కాని రాష్ట్ర నిర్మాణమునకు మాత్రము సమయమాసన్నము కాలేదు.

అంటే ప్రజలలో చైతన్యము తృప్తికరంగాలేదు. పైగా ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ నీలం సంజీవరెడ్డిగారి బోటివారు వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా సమస్యను పరిశీలించక బాధ్యతారహితంగా ప్రకటనలు చేస్తున్నారు.

డా. సుబ్బరాయన్, కామరాజనాడార్ బోటివాళ్లు మద్రాసు నగరం ఆంధ్ర రాష్ట్రంలో చేరదని ప్రకటించడంలో కొంతైనా అర్థమున్నది కాని చారిత్రాత్మకంగా కాని, జనాభా దృష్ట్యాగాని, ప్రభుత్వ ఆదాయ దృష్ట్యాగాని ఆంధ్రులకు మద్రాసుపైగల హక్కును విస్మరించి 'మద్రాసుపై హక్కును తెలుగువారు వదులుకోవాలని' శ్రీ సంజీవరెడ్డిగారు, వారి అనుచరులు ప్రకటించడం సబబుకాదు.

(332 పేజి చూడుడు)

## శ్రీ నందననామ సంIIర జ్యేష్ఠ-ఆషాఢమాసములు.

| | | | |
|---|---|---|---|
| జూన్ నెల 1952 సంII | 16 | సో | ష 22.9 ఉ భా 8.39 రా 5.39 తిధిద్వయం |
| | 17 | మం | ద 18.43 రే 6.53 రా 24.18 త్యా 3.58 |
| | 18 | బు | ఏ 16.28 అశ్వ 6.17 ది 30.35 త్యా 4.3 |
| | 19 | గు | ద్వా 15.28 భ 6.53 రా 4.39 త్యా 4.8 కూర్మజయంతి |
| | 20 | శు | త్ర 18.38 కృ 8.43 త్యా 4.12 మాసశివరాత్రి |
| | 21 | శ | చతు 17.3 రో 11.43 ది 26.41 త్యా 4.16 కటకాయనం |
| | 22 | ఆ | ● అమా 19.28 మృ 15.44 తిరువళ్ళూరు వీరరాఘవస్వామి వాం తెప్పోత్సవః |
| | | | **ఆషాఢమాసం** |
| | 23 | సో | శుద్ధపాడ్యమి 22.50 ఆర్ద్ర రా 21.10 త్యా 4.22 శూన్యతిథిః |
| | 24 | మం | వి 26.43 పున 26.6 రా 15.53 త్యా 4.2 తిధిః |
| | 25 | బు | త 31 4 పుష్య 32.1 త్యాజ్యాభావః |
| | 26 | గు | చ 35.32 ఆశ్రే 38.2 ది 7.8 |
| | 27 | శు | పం 39.43 మ 43.55 ది 10.53 త్యా 4.24 |
| | 28 | శ | ష 43.47 పూఫ 49.23 ది 5.37 త్యా 4.22 |
| | 29 | ఆ | స 47.1 ఉఫ 54.10 ది 8.42 భానుసప్తమి |
| | 30 | సో | అ 49.21 హ 58 5 ది 16.25 త్యా 4.16 |
| జూలై నెల 1952 సంII | 1 | మం | న 50.38 చి 60.10 ది 18.43 త్యా 4.11 |
| | 2 | బు | ద 50.39 చి 0.40 ది 15.4 త్యా 4.7 |
| | 3 | గు | ఏ 49.26 స్వా 2.16 వ 19.58 శయనైకాదశి |
| | 4 | శు | ద్వా 46.59 విశా 2.39 ది 12.32 త్యా 3.47 శాకవ్రతారంభం |
| | 5 | శ | త్ర 43.21 అనూ 1.49 జ్యే 58.7 దివ 15.22 |
| | 6 | ఆ | చతు 38.40 మూ 57.5 ది 18.52 |
| | 7 | సో | ○ పౌ 33.9 పూషా 53.16 ది 19.27 త్యా 3.45 |
| | 8 | మం | బ. పాడ్యమి 27.2 ఉషా 48.56 ది 11.42 |
| | 9 | బు | విదియ 20.31 శ్ర 44.19 తిధిద్వయం |
| | 10 | గు | త 13.55 ధ 39.45 రా 24.26 త్యా 3.43 |
| | 11 | శు | చ 7.27 శత 35.26 రా 18.24 |
| | 12 | శ | ప 1.21 షష్ఠ్యం 54.20 పూభా 30.40 రా 22.30 |
| | 13 | ఆ | స 51.8 ఉభా 28.43 రా 25.46 భానుసప్తమి |
| | 14 | సో | అ 47.41 రే 26.43 రా 19.20 శే 1.30 |
| | 15 | మం | న 45.17 అశ్వ 25.50 రా 18.0 అమృతసిద్ధి యోగం. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.